# ఒక్క మాట

ఇది మూడవ ముద్రణ. అచిరకాలంలోనే తొలి రెండు ముద్రణల ప్రతులు అయిపోయినవి. స్వయముగా గాని, పురోహితుని సహాయముతోగాని లఘువుగా సత్య వ్రతము చేసుకొనుటకు వీలుగా రూపొందింప బడినది.

సత్యవ్రతములో కథను వినుట, మననము చేసుకొనుట అతి ముఖ్యము. అందువల్ల ఈ మూడవ ముద్రణలో కథను సంక్షిప్తముగా సందర్భానుసారము పురాణము నందలి కొన్ని శ్లోకములతో కూడ ఇచ్చుట జరిగినది. వ్రతముచేసి దానిని పఠించవలెను.

సత్యమును గురించి వివరించు శ్లోకములు ప్రత్యేకముగా ఇవ్వబడినవి. వాని భావమును హృదయగతము చేసుకొని సంస్కారము పొందదగి యున్నది.

మూడవ ముద్రణమున అన్నవరం క్షేత్రగాథను గూడా ఇచ్చుట జరిగినవి. సత్యనిరతికి సంబంధించిన ఈ ప్రబోధమును ప్రజానీకము, పురోహితులు సమాజమున వ్యాప్తి చేయుదురుగాక అని ఆశించబడుచున్నది.

—ప్రకాశకులు

# సత్యవ్రతం ఏమిటి ? ఎందుకు ?

సత్యం అంటే అందరికీ అర్థమవుతుంది. కాని అర్థం సమగ్రంగా చెప్పాలంటే కష్టం అవుతుంది. ధర్మం అనేదిగూడా అంతే. హిందూ సంస్కృతిలో ఈ రెండు అద్భుత శబ్దాలు.

సత్యానాస్తి పరోధర్మః
సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ
సత్యేన వాయురావాతి
సత్యే నాదిత్యోరోచతే
దివి సత్యం వాచః ప్రతిష్ఠా
సత్యే సర్వం ప్రతిష్ఠితం
తస్మాత్సత్యం పరమం వదంతి
సత్యం పరం వరం సత్యం॥

అన్నారు పెద్దలు. సత్యాన్నిమించిన ధర్మం లేదు. సత్యమే జ్ఞానం. అది అనంతబ్రహ్మ స్వరూపం. సత్యమువల్లనే వాయువు వీస్తుంది. సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. సత్యమువల్లనే వాక్కు శాశ్వతమవుతుంది. సర్వము సత్యమునందే నిష్ఠితం. కనుకనే సత్యం సర్వశ్రేష్ఠం, సర్వోత్కృష్టం, శ్రేయోదాయకం అని తాత్పర్యం. ఇలా చెప్పుకుంటూపోతే మనకు సత్యం అనేది ఒక అద్భుత, అనంత, మహత్తర విషయంగా ఊహకుఅందుతుంది.

మామూలు వ్యవహారంలో సత్యం అంటే నిజం పలకడం, అబద్ధం ఆడకుండా ఉండడం అనేది పిల్లలకుసైతం అర్థమయేవిషయం.

అంతకుమించిన విశేషాలనుకూడా గమనిస్తే మనకు మరికొన్ని ముఖ్య అంశాలు అవగతమవుతాయి.

సత్యం అనేది ఒక వ్యక్తి మనస్సుకు, మాటకు, చేతకు సంబంధించిన విషయం. చిత్తశుద్ధి, మనస్సాక్షి, మాటలోనిజం, మాటకు తగిన చేత, ఋజువర్తనం ఇవి వ్యక్తిపరంగా సత్యనిష్ఠకు లక్షణాలు.

సత్యం అనేది సంఘానికి-అంటే సమాజానికి కూడా సంబంధించి నట్టిది. ఒకరితో ఒకరు అబద్ధాలు చెప్పుకుంటూ ఉండరాదని, చెప్పేదొకటి చేసేదొకటి కారాదని అంటుంటాం. ఇది సమాజ పరమైన సత్యనిష్ఠ. ఈ నిష్ఠ లేకపోతే సమాజ జీవితం అస్థిరము, భ్రష్టము అవుతుంది. ఆ స్థితి కొంత నేడు చూస్తున్నాం.

ఇక జగత్తుపరంగా ఆలోచిస్తే-దైవమే సత్యం అని, జగత్తులోని ప్రతి అంశము సత్యమువల్లనే తన విద్యుక్తధర్మాలను నెరవేరుస్తుందని గ్రహిస్తాం. మనస్సులో దైవం ఉండాలి. మానవాళిని దైవంగా భావించాలి. జగత్తులోని ప్రతి దానిని దైవంగా గుర్తించగలగాలి. ఇదంతా మనకు హిందూ ధర్మం నేర్పే సత్యనిష్ఠ. ఈ సత్యనిష్ఠ సర్వేసర్వత్రా పాటించబడితే అంతా సవ్యంగాను, సుఖంగాను, విజయప్రదంగాను, ఆనందంగానే ఉంటుంది. ఏ మేరకు సత్యం తప్పితే ఆ మేరకు సుఖం తప్పుతుందనేది అర్థం చేసుకొనదగిన విషయం. సత్యంవల్లనే జీవితానికి సార్థక్యము, విజయము, సత్యమేవజయతే.

నేడు ప్రపంచంలో మనిషిని మనిషి దోచుకుంటున్నాడు. స్వార్థం విలయ తాండవమాడుతోంది. ప్రజలు, వర్గాలు, దేశాలు పరస్పరం ద్వేషించుకుంటున్నాయి. వేధించుకుంటున్నాయి. బాధించుకుంటున్నాయి. అందరూ దుఃఖాన్ని అనుభవిస్తున్నారు. సుఖంగా ఉన్నామనుకునేవారు

సైతం ఏదో విషయంలో దుఃఖం అనుభవిస్తూనే ఉన్నారు. మానవ జీవితం మహనీయతకోల్పోతున్నది. సమాజ వ్యవస్థ నిరర్థకమవుతున్నది. అందుకు మూలకారణ మేమిటి ? ఎందుకింత అశాంతి పెరిగింది? మనిషి ఎందుకు ఇంతగా అవినీతి, మోసం, దగా, పరపీడనలకు పాల్పడు తున్నాడు? లోకం ఏమయిపోతుందోనని, ఎవరు యుద్ధప్రమాదం తెచ్చి పెడతారో? ఏక్షణాన మానవాళి అంతమయిపోతుందో నని ఎందుకు బెంబేలు పడిపోతున్నారు?

లోకంలో సైన్సు పెరిగింది. డెమాక్రసీ, సోషలిజం, సెక్యులరిజం ఇలా ఎన్నెన్నో రకరకాలు వాదాలు ప్రబలినాయి. రాజ్యాతంత్రాలు రాజకీయ వ్యవస్థలు, యంత్రాలు, యంత్రాంగాలు చాలా పెరిగాయి. కాని దుఃఖము, వేదన తగ్గడం లేదు. శాంతి కనిపించడంలేదు. ఈ యంత్రాగమంతా ఈ దుస్థితికి కారణం చెప్పలేక పోతున్నాయి. కాని హిందూ సంస్కృతి చెప్తోంది – ఏ మేరకు లోకులు సత్యము, ధర్మము తప్పారో ఆ మేరకు దుఃఖం, అశాంతి అనుభవిస్తున్నారు అని స్పష్టం చేస్తోంది నేడు మనదేశం హిందూ సాంస్కృతిక మూల్యాలకు దూర మయిన కారణంగా ఉత్పన్నమయిన ఫలితాలు గమనిస్తున్నాం.

ఇది యుగధర్మమని, కలిప్రభావం అని కొందరు విషయజ్ఞులు చెప్తుంటారు. అయితే మానవాళి దుఃఖంలో మునిగి ఉండక తప్పదా! సత్యనిష్ఠవల్ల మానవాళి దుఃఖాన్ని అధిగమించగలదని హిందూ ధర్మం, హిందూ సంస్కృతి ప్రబోధిస్తున్నాయి. దేశాన్ని హిందూ ధర్మ సంస్కృతులపై పునఃప్రతిష్ఠ చేసుకొనవలసిందిగా విజ్ఞులు హితవు చెప్తున్నారు.

మనకంటే ముందే ఒకప్పుడు నారద మహర్షి – రానున్న కలి కాలాన్ని, ఆ కాలంలోని దుఃఖాన్ని ఊహించి – అది నివారింపబడేందుకు

ఉపాయం చెప్పవలసిందని విష్ణుదేవుని ప్రార్థించాడు. అప్పుడు సత్యనారాయణస్వామి వ్రతం అనేదానిని జరపవలసిందని ఆయన ఉపదేశించాడు–అని మనకు స్కాందపురాణం చెప్తుంది. నిజానికి ఇది కథా, రూపంలో ఉన్న హితబోధ. సత్యమును అనుష్ఠించి సుఖమును పొందవలసిందని ప్రబోధం.

సత్యమే దైవ స్వరూపమని గుర్తించి, నారాయణ స్వరూపమని భావించి సత్య స్వరూపాయ నారాయణాయ అని స్మరించి, మనస్సులో దైవాన్ని నిలుపుకుని, మాటలో నిజానిజాలు నిలుపుకుని, చేతల్లో సత్కర్మలు చేస్తూ, ఎల్లరి సుఖమును, శుభమును కోరుతూ అందుకు అవసరమయిన తీవ్రనిష్ఠతో జీవించవలసిందని, తద్వారా మాత్రమే ఎల్లరికి సుఖం ఉంటుందని ఆ ప్రబోధ సారాంశం. అందుకు సంకేతంగా సాధనగా మనకు సూచింపబడినదే ఈ సత్యనారాయణ వ్రతమని గ్రహించదగి ఉంది.

నిరాకారమైన విషయములను సాధారణ మానవుడు సాకారంగా చెప్పబడినప్పుడు చక్కగా అర్థం చేసుకొనగలుగుతాడు. అనుష్ఠించగలుగుతాడు. మనసును మలచుకోగలుగుతాడు. సత్యనారాయణస్వామి వ్రతాన్ని, అందలి ప్రతి విశేషాన్ని ఈ దృష్టితో అర్థం చేసుకుంటూ ఆచరించాలి. అందుకే ఈ వ్రతాన్ని ఆచరించేటప్పుడు కథ వినడం–అంటే భావాన్ని అర్థం చేసుకోవడం–చాలా ముఖ్యం అంటారు.

జీవితంలో సత్యనిష్ఠ చాలా కష్టతరమైనది. తీవ్రమైన శ్రద్ధ, భక్తి, నియమం, శౌచం, పట్టుదల ఇత్యాదులనేకం ఉంటే తప్ప దానిని సరిగా పాటించలేం. కృతకృత్యులం కాలేము. అందుకు సంకేతంగా నియమ నిష్ఠలు ఈ వ్రతంలో ప్రత్యేకంగా చెప్పబడ్డాయి. ఈ నియమ

నిష్ఠలు, భక్తి శ్రద్ధలు ఆసాంతం ఉండాలి. ఏ మాత్రం ఏమరపాటు తగదు అనేది గుర్తుచేస్తూ వ్రత పరిసమాప్తికి భౌతిక సంకేతమయిన ప్రసాదాన్ని విధిగా స్వీకరించాలనికూడా విశేషించి వక్కాణిస్తారు.

ఈ నియమం ఏ కొందరికో పరిమితమైనది కూడా కాదు ప్రతియొక్కరికి విధి. విహితమైనట్టిది. పరంపరాగతముగా బ్రహ్మ, క్షత్రియ, వైశ్య శూద్రులు అంటూ ప్రస్తావింపబడే ప్రజానీకం అంతా ఆచరించాలని ఇందు చెప్పబడడం – రాజులు, పేదలు, పండితులు – పామరులు – ప్రత్యేకించి స్త్రీలు, వంధ్యలు, వితంతువులు, బాలలు సైతం ఆచరించాలంటూ పేరు పేరున ఉద్బోధించడం గమనార్హం. ఎవరిని మినహాయించినా, ఉపేక్షించినా, నిర్లక్ష్యంచేసినా అది అపచారమే. సత్య వ్రతం జీవితంలో అందరూ పాటిస్తే నే ఏ సమాజానికైనా సుఖ శాంతులు.

ఈ వ్రతాన్ని బంధుమిత్రులతో, సామాజికులతో కలిసి జరపా లనేది మరో విశేషం. పిలువకపోయినా పాల్గొనేందుకు, కానుకలు సమర్పించుకునేందుకు అందరూ అర్హులే. అందరికీ కర్తవ్యము, అధికారము ఉంది. ప్రసాదాన్ని అడిగి పెట్టించుకోమంటారు. అందరూ కలిసి సమా రాధన, భోజనం చేసుకోమంటారు. సత్యనిష్ఠకు, సమాజ చింతనకు ఇదంతా సంకేతం.

ఈ విధంగా ఇది ఒక అద్భుత వ్రత ప్రతిపాదన. వ్రతం నిమిత్తంగా జీవితంలో సాధనకు ప్రతిపాదన. దీనిని ప్రతిపాదించింది. హిందూ సమాజమే అయినా, ఇది ప్రతిపాదింపబడింది హిందూదేశంలోనే అయినా ఈ సత్యనిష్ఠ, యావత్తు మానవాళికి అవసరమైనట్టిది. ఈ వ్రత ఫలం యావత్తు మానవాళి అనుభవించదగింది, మానవాళిలో సత్యం లోపిస్తే అన్ని జాతులు, దేశాలు, దుఃఖము, అశాంతి అనుభవిస్తాయి.

ఈ సత్య నియమపాలనవల్ల—అంటే సత్యనిష్ఠవల్ల తాను, తన సమకాలీన సమాజము సుఖముగా ఉండడమేగాక, లోగడ జరిగిన పొరపాట్ల దుష్ఫలితాలు సైతం నివారింపబడడం సంభవమవుతుంది. భవిష్యత్తులో సైతం సుఖము సాధ్యమవుతుంది. ఈ అంశములన్ని మనకు సత్యనారాయణ వ్రత సమయమున విధిగా చెప్పబడు అనేక కథల రూపంలో బోధింపబడతాయి.

## కథ అంతరార్థం

నిజానికి సత్యానికి రూపంలేదు. కలశం పెట్టుకుంటారు, నారాయణ స్వరూపాన్ని భావిస్తారు. సత్యనారాయణ స్వామికి కథ అనేదికూడా లేదు. ఈ జగత్కథ అంతా ఆయనదే. వ్రత సమయంలో మనం చెప్పుకొనే కథలు—సత్యనారాయణస్వామి వ్రతమహత్మ్యమునకు సత్యవ్రత శక్తికి సంబంధించిన కథలు. సత్యాన్ని పాటిస్తే ఏమి సత్ఫలితములు కలుగుతాయి? విస్మరిస్తే ఎట్టి దుష్ఫలితాలు కలుగుతాయి? అనే వివరణ రూపంలో ఈ వ్రతనిష్ఠ ఆవశ్యకత మన మనస్సులలో ముద్రవేయబడుతుంది.

శ్రీ సత్యనారాయణస్వామి వ్రతంలో ఒక అతి ముఖ్యాంశం శ్రద్ధాభక్తులతో సమష్టిగా కథ చెప్పుకోవడం, వినడం, వ్రతఫలం. అలా శ్రద్ధగా కథను స్మరించుకొని, అందలి అంతరార్థాన్ని గ్రహించి జీవితంలో ఆచరించటంలో వుంది. సత్య నిష్ఠ ప్రాముఖ్యాన్ని గురించి అవగాహన కల్గించేందుకు శ్రీ స్కాంద పురాణంలో రేవా ఖండంలో సూతశౌనక సంవాద రూపంలో చెప్పబడిన పెక్కు కథలు అవి.

శ్లో॥ కథాంవాశృణు యాద్యస్తు
పశ్యేద్వా వ్రత ముత్తమం
తస్యనశ్యంతి పాపాని
సత్యదేవ ప్రసాదతః

ఈ కథలను విను వారికి, వ్రతమును చూచు వారికి సత్యదేవుని ప్రసాదము వలన పాపచింతనలు తొలగుతాయి. పుణ్యాచరణము, పుణ్య ఫలములు లభిస్తాయి.

పూజా కల్పము తరువాత 5 అధ్యాయముల కథలు చెప్పుకొని, భోజనాదికములు చేసుకొని మిగిలిన నాల్గు అధ్యాయములను అనంతరము ఏకాదశినాడు, వీలువెంట చెప్పుకుంటారు, (ఆ మొదటి 5 అధ్యాయముల సారాంశము వరకు ఇచట పొందుపరచ బడుచున్నది. ధ్యాన పురస్సర ముగా చదువడగి యున్నది.)

శ్లో॥ కలౌ పాపాత్మానాం సూత
రోగ పీడాది వినాశకమ్
వాంఛా ఫలం ప్రద నోఽద్య
బ్రూహి వ్రతమనుత్తమమ్॥

కలి కాలంలో పాపముల చేత సంభవించె సమస్త రోగాది పీడలను నశింపజేసి, కోరికలను సిద్ధింపజేయునట్టి ఉత్తమ వ్రతాన్ని చెప్ప వలసిందని శౌనకాది మహా మునులు సూత మహర్షిని అడుగుతారు. ఇదే విషయముపై నారదుడు శ్రీవిష్ణుమూర్తిని అడిగినప్పుడు, విష్ణుమూర్తి నారదునికి చెప్పిన దానిని మీకు చెప్తాను. అంటూ సూతుడు ఆ వ్రత ప్రాముఖ్యమును, విధానమును, ఫలితములను వివరిస్తాడు.

మొదటి కథలో....అతడు పరమ యోగ్యుడయిన వేద పండితుడు. కాశీలో జీవిస్తున్నాడు. ఏనాటి పాపము వల్లనో, అంతటి మహానీయుడు

పేదరికంతో దుఃఖంతో జీవిస్తున్నాడు. అతడి పుణ్య విశేషంచేత, నారాయణమూర్తి వృద్ధమూర్తి రూపంలో తనకు తానై వచ్చి సత్యవ్రత మును గురించి బోధించి వెళతాడు. ఆ పేద బాపడు భక్తిశ్రద్ధలతో వ్రతం ఆచరించి, పాప విముక్తి పొంది, సుఖ జీవనం సాగించి, అంత్య మున మోక్షం పొందుతాడు.

శ్లో॥ ఏవం నారాయస్యేదం
వ్రతం కృత్వాద్విజోత్తమః
సర్వ పాప వినిర్ముక్తో దుర్లభం
మోక్ష మాప్తవాన్

ఆని వివరించాడు సూతుడు.

సంపన్నుడయిన తరువాత ఆ విప్రోత్తముడు బంధు-మిత్రులతో ఒకసారి మళ్ళీ మళ్ళీ వ్రతం చేస్తుండగా ఒకసారి ఒక కట్టెలమ్మే వ్యక్తి దాహంతో మంచినీళ్ళ కోసం ఆ యింటికి వెళ్ళి ఈ వ్రతం చూస్తాడు. అతడు నిరుపేద. విద్యలేదు. అమాయకుడు. కాని చిత్తశుద్ధి, శ్రద్ధాభక్తులు వున్న యోగ్యుడు. కష్టించి ధనము సంపాదించి విధి విధానము ప్రకారము వ్రతము చేసి...

తద్ర్వ తస్య ప్రభావేన
ధన పుత్రాన్వితో భవత్
ఇహ లోకే సుఖం భుక్త్వాచ
అంతే సత్యపురం యయే॥

ఆ వ్రత ప్రభావము చేత ధన, పుత్రాదులతో సుఖము అనుభ వించి అంత్యమున సత్య పురమును చేరుతాడు. ఈ వ్రతమునకు విప్రుడు, కట్టె లమ్మువాడు అని తేడా లేదు. వ్రతము చేయుటకు, ఫలి తము పొందుటకు అందరూ అర్హులేనని ఇందలి ప్రబోధము.

మరియొక కథ ఉల్కాముఖుడను రాజును సంబంధించింది. అతడు—

శ్లో॥ జితేంద్రి యస్సత్యవాదీ
గచ్ఛన్ దేవాలయం ప్రతి
దినే దినే ధనం దత్వా
స్సంతోష యేత్సుధీః

ఇంద్రియ నిగ్రహం కలవాడు. సత్యవాది. ప్రతి దినము దేవాలయమునకు వెళతాడు. దాన ధర్మములతో ఎల్లరిని సంతోష పెడుతుండెడి వాడు. కాని అతడికి సంతానము లేదు. అది అతడి దుఃఖము. ఆ దుఃఖమును బాపుకొనుటకు పతివ్రతయగు తన భార్యతో కలిసి భద్రశిలా నదీ తీరంలో సత్యవ్రతం చేసుకుంటున్నాడు.

ఆ సమయంలో సాధువను వర్తకుడొకడు ఆ నదీ తీరంలో తన నావను లంగరు వేసి ఈ వ్రతం చూస్తాడు. అతడికిని సంతానము లేదు. ఇంటికి వెళ్ళి తన సతీమణియగు లీలావతికి ఈ వ్రత విషయం చెప్పి తనకు సంతానం కల్గితే వ్రతం చేస్తానని మొక్కుకుంటాడు. ఆ మొక్కు ఫలితంగా వారికి ఒక కుమార్తె జన్మిస్తుంది ఆ పాపకు కళావతి అని పేరు పెట్టుకున్నారు. భార్య సత్యవ్రతం చేద్దామని సూచించగా అతడు—

శ్లో॥ వివాహ సమయే తస్యాః
కరిష్యాం వ్రతంప్రియే

కుమార్తె వివాహ సమయంలో చేసుకుందాం అన్నాడు.

కళావతికి సుందరుడైన వర్తక యువకునితో వివాహం కూడా ఆయింది కాని...

శ్లో॥ తతో భాగ్యవశాత్తేన
విస్మృతం వ్రతముత్తమం

తన ధనాధిక్యతలో సత్యవ్రతం చేయడాన్ని విస్మరించాడు సత్యావృత వృత్తి అతడిది. ప్రవృత్తి కూడా అట్టిదే అయింది. మాట తప్పిన మనిషి అతడు. ధన చింతన ఉన్నంతగా దైవ చింతన లేకపోయింది. బుద్ధి లోపభూయిష్ట మయింది. అతడు ఫలితం అనుభవించవలసిన వాడయినాడు.

అల్లునితో కలిసి వర్తకమునకు బయల్దేరాడు. సముద్రతీరమందున్న రత్న సానుపురానికి వర్తకానికి వెళ్లాడు. ఉభయులూ చంద్రకేతు మహారాజు నగరానికి వెళ్లారు. చేసిన అపచారం వారిని వెన్నాడుతున్న ఫలితంగా-దొంగ వాడొకడు రాజుగారి ఇంట్లో దొంగిలించి వర్తకులున్న చోటుకు వచ్చాడు. భటులు వెన్నాడు తున్నందువల్ల భయంతో ఆ దొంగ దొంగిలించిన ధనాన్ని ఈ వర్తకునివద్ద ఉంచి పారిపోయాడు. భటులు ఈ వర్తకులే దొంగలని భ్రమించి వర్తకులను రాజు సమక్షంలో ఉంచారు. రాజు విచారణకూడా లేకుండా కారాగారంలో ఉంచాడు.

ఇక వర్తకుని ఇంటి పరిస్థితి కూడా చెడిపోయింది. దొంగలుపడి ధనం ఎత్తుకు పోయినారు, వర్తకుని భార్య లీలావతి అతని కుమార్తె కళావతి భిక్షాటనతో జీవించవలసిన పరిస్థితి ఏర్పడింది.

కళావతి ఒకనాడు భిక్షాటనకై వెళ్లినప్పుడు, ఒక ఇంట్లో సత్యవ్రతం జరుగుతుండగా ఆగిపోయి వ్రతంచూచి, కథవిని, ప్రసాదం తీసుకుని ఆలస్యంగా ఇంటికి చేరింది. ఆలస్యంగా వచ్చినందుకు తల్లి మందలించగా కళావతి కారణం చెప్పింది. వెంటనే తల్లికి తన భర్త

వ్రతం చేస్తామన్న విషయం, అది నేరవేర్చక పోవడం జ్ఞాపకం వచ్చి తమ దుస్థితికి కారణం సత్యవ్రత ప్రతిజ్ఞా భంగం అని గుర్తించి పశ్చాత్తాపంచెంది, వెంటనే బంధు జనులతో కలిసి సత్యవ్రతం జరిపింది.

శ్లో॥ భర్తృ జామాత రేక్షీ ప్రమాగచ్ఛేతాం స్వమాశ్రమం
అపరాధంచమే భర్తుర్జామాతుః క్షంతు మర్హసి

నాభర్త తప్పును మన్నించవలసింది. నాభర్త అల్లుడు త్వరగా ఇంటికి వచ్చేలా చేయవలసింది అని సత్యదేవుని ప్రార్థించింది.

ఆమె ప్రార్థన ప్రభావం అటు చంద్రకేతు మహారాజును కదలించింది. ఖైదీగా ఉన్న వణిజులను విడిపించవలసిందని స్వామి స్వప్నంలో ఉత్తర్వు చేసినట్లనిపించింది. సభను సంప్రదించి రాజు వారిద్దరిని విడిపించాడు. విచారణ లేకయే శిక్షించిన రాజు విచారణలేకయే విడిపించాడు. ధనమును తిరిగి ఇచ్చి పంపాడు.

వర్తకులు ఇక స్వస్థానానికి బయల్దేరారు. వర్తకుని భార్య చేసిన తప్పును గుర్తించింది. పశ్చాత్తాపపడి, వ్రతం జరిపించింది. మరి వర్తకుడు గుర్తించాడా ? అతడు మార్పు చెందాడా ? అది తేలవలసిన విషయం.

వర్తకుడు పడవలో సామగ్రితో వెళ్తుండగా ఒక సాధువు తారసిల్లాడు. పడవలో ఉన్న దేమిటని అడిగాడు. ఆ వర్తకునికి అసత్యమాడడం నీళ్ల ప్రాయం. నిజం చెపితే ఆ ధనంఎత్తుకు పోతాడేమో అనిపించి "ఏమున్నాయి ఆకులు' తీగలు" అని తేలికగా అబద్ధ మాడేశాడు. సత్యవ్రతం అతడికి ఏమాత్రం అంటలేదు.

ఆ తర్వాత వర్తకుడు వెళ్లి పడవలో చూస్తే నిజంగానే ఆకులు తీగెలు ఉన్నాయి. గుండెలు బాదుకుంటూ, దుఃఖపడ జొచ్చాడు. ఇది ఆ సన్యాసి మహిమ కావచ్చునని అల్లుడు సూచించడంతో, ఇద్దరూ కలిసి, ఆ సమీపమందే ఉన్న సన్యాసి, కాళ్ల మీద పడ్డారు.

శ్లో॥ క్షమ స్వచాపరాధంమే యదుక్తం తవసన్నిధే
ఏవం పునఃపునర్నత్వా మహాశోకాకులో౽ భవత్॥

ఓ మహానుభావా! మీతో అసత్యం ఆడాము. క్షమించండి అంటూ ప్రాధేయ పడ్డాడు.

సన్యాసి దయాళువు. అతడు స్వామియే. "నా పూజను విస్మరించిన ఫలితంగా నీకు మాటిమాటికి దుఃఖాలు కల్గుతున్నాయి" అని గుర్తుచేశాడు. అప్పటికిగాని వర్తకుని కండ్లు తెరవబడలేదు. వెంటనే పశ్చాత్తాపంతో –

శ్లో॥ మూఢో౽ హంత్వాం కథంజానే మోహిత స్తవమాయయా
ప్రసీద పూజయిష్యామి యధావిభవ విస్తరం

నేను మూఢుణ్ణి నీ మాయచే మోహింపబడి నిన్ను ఎలా తెలుసుకోగలను? ఇక నా విభవము కొద్ది నిన్ను పూజిస్తాను. అంటూ పలువిధాల ప్రార్థనలుచేసి సన్యాసి రూపంలో వచ్చిన స్వామి అనుగ్రహం పొందాడు. తిరిగి పడవలో ధనరాసులు కనిపించాయి. ఇక తిరుగు ప్రయాణం సాగించారు.

తమ రత్న సానుపురం చేరారు. భార్యా, బిడ్డలకు వెళ్లి తమ రాకను ముందుగా తెలుపవలసిందని వర్తకుడు ఒక భటుని ఇంటికి పంపాడు.

ఆ వార్త తెలియగానే వర్తకుని భార్య లీలావతి పరమానందంతో శీఘ్రంగా సత్యవ్రతం చేసుకుని భర్త వద్దకు బయల్దేరింది. కుమార్తె కళావతినికూడా శీఘ్రంగా వ్రతం పూర్తి చేసుకొని నావ వద్దకు రమ్మని వెళ్లిపోయింది. తర్వాత కుమార్తె కళావతికూడా నావవద్దకు వచ్చింది.

వారు తీరానికి వచ్చేసరికి అల్లుడు, ధన రాసులతోసహా పడవ

మునిగిపోయింది అందరు దుఃఖితులైపోయినారు. చూస్తున్న ప్రజలకు కూడా ఏమీ అర్థం కాలేదు. ఏ కారణంవల్ల ఈ ప్రమాదం జరిగింది. అంటూ లీలావతి గోడుగోడున విలపిస్తూ భర్తను అడిగింది కళావతి దుఃఖ వివశురాలై భర్త పాదరక్షలను తీసుకొని సహగమనం చేయ డానికి సిద్ధమయింది. వర్తకునికి కర్తవ్యం తోచలేదు. స్వామికి మళ్లీ ఏదైనా అపచారం జరిగిందా? తిరిగి వ్రతాన్ని మరుస్తానని ఇది స్వామి చేసిన హెచ్చరికా? అతనిలో జిజ్ఞాస కల్గింది. నా విభవము కొద్ది స్వామి వ్రతం తప్పక చేస్తానని నల్గురు ప్రజలమధ్య బిగ్గరగా ప్రకటించి నమస్కరించి నిలుచున్నాడు వర్తకుడు. ఇంతలో అశరీరముగా—

శ్లో॥ త్యక్త్వా ప్రసాదంతే కన్యా పతింద్రష్టుం సమాగతా
అతోఽ దృష్టోఽ భవత్స్యాం కన్యకాయాః పతిర్ధ్రువం

నీ కుమార్తె పతిని దర్శించ వలెననే ఆత్రుతలో ప్రసాదం స్వీకరించకుండా వచ్చింది. అందువల్ల ఈ విపత్తు జరిగింది.

శ్లో॥ గృహం గత్వాప్రసాదంచ
భుక్త్వాసాయాతి చేత్పునః
లబ్ధ భర్త్రీ సుతాసాధూ
భవిష్యతి నసంశయః.

ఆమె ఇంటికి వెళ్లి ప్రసాదం భుజించి తిరిగివస్తే తప్పక భర్తను దర్శించ గలదు అని — వినబడింది.

అప్పటికిగాని జరిగిన పొరపాటు తోచలేదు. అశరీరవాణి సూచన ప్రకారం చేసి వారు అంతా ఇంటికి చేరారు. అది మొదలు వర్తకుడు ప్రతి పూర్ణిమా సంక్రాంతులందు సత్యవ్రతం చేస్తూ ఇహపర సౌఖ్యాలు అందుకున్నాడు.

సత్యవ్రతం ఎంతటి ప్రబలమైనదో, ఈ ప్రతిజ్ఞా ఉల్లంఘన ఎంత నష్టదాయకమో ఇందు మనకు స్పష్టమవుతుంది. అంతేకాదు భర్త చేసిన పొరపాటును భార్య వ్రతనిష్ఠచే సర్దుబాటు చేయుట, తల్లిదండ్రుల పొర పాటు కుమార్తెవల్ల సర్దుబాటు అగుట ఇందు గమనించగలము. అంతే కాదు ఈ వ్రతం విషయంలో ఎంతో శ్రద్ధ అవసరమని, ప్రసాదమును తప్పక భుజించుటలో గూడా పూర్తి శ్రద్ధ చూపడం అవసరమని ఈ కథలో మనకు స్పష్టమవుతుంది.

ఆ తర్వాత సూతుడు మునివర్యులకు మరియొక కథను వివరించాడు అది తుంగధ్వజుడను రాజు కథ. ఆ రాజు సత్పరిపాలకుడు. దైవభక్తుడు. ధర్మ నిరతుడు.

అతడొకసారి క్రూర మృగములు వేటాడ అడవికి వెళ్లి, ఒక బిల్వ వృక్షం ఛాయకు వచ్చాడు. అక్కడ –

శ్లో॥ గోపాః గర్వంతి సంతుష్టా
భక్తి యుక్తాస్స బాంధవాః
రాజా దృష్ట్వాతు దర్పేణ
నగత్వాతం ననామపః

గోపబాలురు, బంధుమిత్రులతో కలిసి, ఎంతో శ్రద్ధాభక్తులతో సత్య వ్రతం చేస్తున్నారు. రాజు చూచాడు. అయితే దర్పంవల్ల ఆ పూజను పట్టించుకోలేదు.

గోపాలురు రాజును చూచారు. వ్రతం కాగానే రాజుగారివద్ద ప్రసాదాన్ని ఉంచి. తిరిగి తమ స్థానానికి వచ్చి ప్రసాదాన్ని స్వీకరిం చారు.

శ్లో॥ తతః ప్రసాదం సంత్యజ్య
రాజా దుఃఖమవాపసః
తస్య పుత్ర శతం నష్టం
ధనధనాదికం చయత్

దర్పంతో ఉన్న రాజు ఆ ప్రసాదాన్ని కూడా పట్టించుకోలేదు. ఫలితంగా అతడు చాలా దుఃఖానికి లోనయినాడు. అతని నూర్గురు పుత్రులు ఆకస్మికంగా నష్టమైపోయినారు. ధనధాన్యాదులు కూడా మాయమైనాయి. జరిగిన అపచారాన్ని రాజు అర్థంచేసుకున్నాడు. వెంటనే అపచారాన్ని సవరించుకుంటూ –

శ్లో॥ తతోఽసౌ సత్యదేవస్య
పూజాం గోపగణైస్సహ
భక్తిశ్రద్ధాన్వితో భూత్వా
చకార విధినా నృపః

గోపాలుర వద్దకు వెళ్ళి, వారితో కలసి, విధి విధానము ప్రకారము సత్యదేవుని వ్రతమునుచేసి కృతార్థుడైనాడు.

నిజానికి ఆరాజు ధర్మాత్ముడే. కాని అతడు దర్పమువల్ల దైవ పూజను, ప్రసాదమును అనాదరించాడు. అంతేకాదు, ధర్మప్రభువై ఉండి కూడా ప్రజల మధ్య భేదమును పాటించాడు. గోపబాలురు కదా అని అశ్రద్ధ చూపాడు. శిక్షను అనుభవించాడు అపచారములను సవరించుకొని కృతార్థుడయినాడు. సత్యదేవునికి వారు వీరను వివక్షత లేదు. భక్తిశ్రద్ధలు ప్రభావము, గోపబాలురు గాని, మహారాజుగ్గాని, అందరూ సమానమే అని మనమీ కథ నుండి గ్రహించదగియున్నది.

సత్యవ్రతం కథలు మనకు జ్ఞానదాయకములు. ఇవి సత్యనిష్ఠకు సంబంధించిన ప్రబోధములు. సమాజమందలి ప్రతియొకరు సత్యనిష్ఠతో నుండవలెనని, అది లేనియెడల దైవమునకే అపచారము చేసినవారగుదురని, తాము అన్యులు కూడా దుఃఖముల పాలగుదురని సారాంశము. ఆ విషయము ఇందు అనేక విధముల వక్కాణింపబడినది.

శ్లో॥ య ఇదం కురుతే సత్యవ్రతం పరమ దుర్లభం
శృణోతిచ కథాం పుణ్యాం
భుక్తి ముక్తి ఫలప్రదాం
ధనధాన్యాది కంతస్య
భవేత్సత్య ప్రసాదతః

దుర్లభమైన సత్యవ్రతము నాచరించువారికి, పవిత్రమైన ఈ కథను విను వారికి సత్యదేవుని యనుగ్రహము వలన ధనధాన్య సమృద్ధి కల్గును. అంటూ ఫలసిద్ధి చెప్పబడినది.

శ్లో॥ యత్కృత్వా సర్వదుఃఖేభ్యో
ముక్తో భవతి మానవః
విశేషతః కలియుగే
సత్యపూజా ఫలప్రదా
కేచిత్కాలేవ దిష్యంతి
సత్యమీశం త మేవచ
సత్యనారాయణ కేచిత్
సత్యదేవం తథాఽపరే

సత్యవ్రతము చేయువారు దుఃఖములకు దూరమవుతారు. కలియుగంలో విశేష ఫలమిచ్చే వ్రతమిది. ఈదేవుని కొందరు ఈశ్వరుడని, కొందరు సత్యనారాయణుడని, కొందరు సత్యదేవుడని అంటారు.

గొప్ప విశేషమేమంటే స్వయముగా దైవము వ్రతంరూపంలో మనముందుండుట.

శ్లో॥ నానారూప ధరోభూత్వా
సర్వేషా మీప్సిత ప్రదః
భవిష్యతి కలౌ సత్యవ్రత
రూపే సనాతనః

సనాతనుడైన ఆభగవంతుడు అనేక రూపములు ధరిస్తూ, అనేక కోరికల నీడేరుస్తూ, కలియుగంలో సత్యవ్రతం రూపంలో మనకు సులభుడవు తున్నాడు.

జీవితంలో సత్యమ్మును పాటిస్తూ, సత్యవ్రతము నాచరిస్తూ, సత్య దేవుని ప్రసాదమును కృపను పొందుతూ నిరంతరము మనము సుఖ సంతోషములను పొందవలెనని మనకీ వ్రత సందేశము నిచ్చిన ముని వర్యుల సంకల్పము.

వ్రతము చేసుకొని శ్రీస్కాందపురాణములోని రేవా ఖండమందలి పంచమ అధ్యాయము వరకుగల ఈకథలను శ్రద్ధతో చదువుకొని, విని, అందరి సందేశములను గ్రహించి, ఆతర్వాత బంధుమిత్ర సమేతముగా సమారాధన జరుపుకుంటారు.

ఆ తరువాత రాత్రిగాని, అనంతరము వీలువెంటగాని,ఏకాదశినాడు గాని మిగిలిన నాల్గు అధ్యాయముల కథలు చెప్పుకుంటారు.

ఆరవ అధ్యాయములో శ్రీరామచంద్రుడు ఈ సత్యవ్రతము నాచ రించినట్లు చెప్పబడినది. శ్రీరామచంద్రుడు ఆంజనేయునిద్వారా సీతా మహాదేవి లంకలో ఉన్నట్లు తెలుసుకొని, లంకకు బయల్దేరుతాడు. అప్పుడు సముద్రమును దాటుట ఎట్లు? అను ప్రశ్న వచ్చినది. శ్రీరామ చంద్రుడు సాక్షాత్తు పరబ్రహ్మమే అయినప్పటికిని రామాయణ కథ వరకు మానవుడు. మానవుడుగానే, ధర్మపరుడైన మానవుడుగానే వ్యవహరిం చాడు. సముద్రమును ఎలా దాటాలి? అనే ప్రశ్న అందుకే వచ్చింది.

అచటికి సమీపములో బకదాల్భ్యుడనే మహాముని ఉన్నాడు. ఆ మునిని ఉపాయమడుగుదామని లక్ష్మణుడు సూచించాడు. అప్పుడు శ్రీరామ చంద్రుడు ఆ మహాముని ముఖతః—

(2)

శ్లో॥ సత్యనారాయణో విష్ణుః
వాంఛితార్థ ఫలప్రదః
తస్యైవ పూజనాద్రామ
విజయస్తే భవిష్యసి

సత్యనారాయణ స్వరూపుడైన విష్ణుదేవుని గురించి వ్రతము చేసిన జయము పొందుదువని చెప్పించుకొని, సోదరుడగు లక్ష్మణునితో కలసి, వ్రతముజేసి అనంతర కార్యమును సాధిస్తాడు. అన్నదమ్ములు సైతం కలిసిచేయు వ్రతమిదియని మనము గ్రహించదగియున్నది.

ఏడవ అధ్యాయములో ద్వాపరయుగములో మాహిష్మతి యను నగరమునగల మహీజిత్తను రాజు కథ చెప్పబడినది. అతడు దీర్ఘ కాలము ధర్మపాలనచేసినాడు. శిష్టరక్షణ దుష్టశిక్షణ నియమానుసారము రాజ్యము చేసినాడు కాని ఎట్టి అధర్మమును చేయలేదు. అయినను పూర్వ కర్మ ఫలితముగా అతడికి సంతానము లేకపోయినది. వయస్సుకూడా మీరుచున్నది. రాజు శ్రేయస్సును కోరి సభాజనులు జితేంద్రియుడు, ధర్మవిదుడు, త్రికాలజ్ఞుడు, పెక్కు బ్రహ్మ కల్పములు చూచిన వాడు అయిన లోమశుడు అను మహామునిని సందర్శించి విషయము విన్న వించారు. ముని కొంతసేపు ధ్యానించి రాజు పూర్వజన్మ వృత్తాంతమును గుర్తించాడు. పూర్వజన్మమందు రాజు దుర్మార్గుడయి వార్తాహరుడుగా ఉండేవాడని, ఒకసారి తన దాహము తీర్చుకొనుటకై ఒక మడుగునకు వెళ్ళి, అచట దాహముతోనున్న గోవులను తరిమివేసి తన దప్పికను తీర్చుకొని పాపము కట్టుకున్నాడని, అయితే అంతకు పూర్వజన్మమందలి పుణ్య విశేషముచే రాజరికము వచ్చినదని, పాపమువలన నిస్సంతువయి నాడని వివరించాడు. రాజు ప్రస్తుతము సత్యనారాయణ వ్రతము చేసిన యెడల పుత్రవంతుడు కాగలడని చెప్పాడు. ఒకవేళ రాజు ఆ వ్రతము చేయజాలని యెడల-

శ్లో॥ వ్రతం పుణ్యం ప్రదాతవ్యం
యుష్మాభిస్తు కృతవత్తైః
ఏవం శ్రుత్వా తతో వాక్యం
ప్రణమ్య ద్విజసత్తమమ్.

మీరు దానినిచేసి రాజునకు వ్రతఫలం దానం చేసినను ఆఫలితము సిద్ధించ గలదని చెప్పాడు. ఆప్రకారం ప్రజలు వ్రతముచేసి ఫలమును దానము చేసి తాము, రాజు, రాజ్యము కృతార్థులైనారు. అది మొదలుకొని ప్రజానీకం ఆ వతమును ఆచరిస్తూ వచ్చిందని లోమశుడు వివరించాడు. స్వయముగా వ్రతము చేసుకొనలేని పరిస్థితులలో, అన్యులయినను ఆ వ్రతము చేసి ఫలమును దానమీయవచ్చునని, పరిపాలకుడు వ్రతముచేయని స్థితిలో ప్రజలే వ్రతముచేసి రాజ్యమునకు శ్రేయస్సు కల్గించవచ్చునని ఇందు గమనార్హము.

ఇక ఎనిమిదవ అధ్యాయములో పరమ దుర్మార్గునికి సంబంధించిన కథ యొకటి చెప్పబడినది.

అతడి పేరే దుష్టబుద్ధి. పేరుకు తగిన బుద్ధులు అతడివి. దరిద్రుడు. కౌశికీనదీ తీరమున నివసించేవాడు. విద్యాగంధము లేకపోయినా ధన సంపాదన ఉపాయములు మాత్రము తెలుసు.

శ్లో॥ అన్యాయో పార్జితం విత్తం
కోటిద్వయము పేయువాన్
దాన ధర్మ విహీనస్సన్
ద్రవ్యార్జన పరూభవేత్.

అన్యాయాలతో రెండు కోట్లు సంపాదించాడు. దాన ధర్మబుద్ధి లేదు. ఇంకా సంపాదిద్దామనే అతడి బుద్ధి. ఈ అవలక్షణాలకు తోడు నాస్తికుడు. దేవుని నమ్మేవారంతా మూఢులని భావించే మూర్ఖుడు కూడా.

శ్లో॥ దేవతా రాధనం లోకే
మూఢాః కుర్వంత్య పండితాః
సత్యనారాయణం దేవం
యజంతి పరమాద్భుతం

జనం మూఢులై దేవతారాధనలు చేస్తున్నారని ఆశ్చర్యపడేవాడు.

శ్లో॥ బుద్ధిహీనాశ్చతే సర్వే
ద్రవ్యం వ్యర్థం త్యజంతిహి
దేవతారాధనే నైవ
ధన ప్రాప్తిః కథంభావేత్

ఈ మూఢులంతా బుద్ధిహీనులై ధనాన్ని వృధా చేస్తున్నారు. దేవతా రాధనవల్ల ధనమెలా వస్తుంది? దేవతా పూజ వల్లనే ధనం వస్తే అందరూ ధనవంతులే కావచ్చు కదా? నేను ఏ దేవతారాధన చేస్తే ధన వంతుడనైనాను? అని ప్రశ్నలు వేసినాడు. అంతే కాదు —

శ్లో॥ పశ్యాలు సత్యమహాత్మ్యం
మద్విత్తం నాశితం యది
దుష్టబుద్ధి కరోతీతి
సత్య హేళన మన్వహమ్

ఈ సత్యదేవుని మహాత్మ్యమేమిటో చూస్తాను. నా ధనాన్ని నాశనం చేయగలదేమో అంటూ నిత్యమూ హేళన చేస్తుండేవాడు.

అలా ఉండగా అతడికి దేశాంతరం వెళ్లి వ్యాపారం చేయాలని బుద్ధి కల్గింది- వెళ్లి ఇంకా సంపాదించాడు.

అక్కడ ఒకచోట ఒక బ్రహ్మ ఉత్తముడు వైభవంగా సత్యనారాయణ వ్రతం చేసుకుంటున్నాడు. పలువురికి ఆహ్వానాలు పంపాడు. దుష్టబుద్ధికికూడా ఆహ్వానం వచ్చింది. ఆహ్వానాలు రానివారు సైతం స్వామి వ్రతానికి ఆనందంగా వస్తుంటే ఈ దుష్టబుద్ధి –

శ్లో॥ ప్రార్థితో దుష్టబుద్ధిస్తు
నాయాతి నపది ద్విజాః
అ నాగతో ఽ పి సత్యస్య
హేళనం కృతవానితి

బ్రాహ్మణుడు ప్రార్థనా పురస్సరంగా ఆహ్వానిస్తే వెళ్ళకపోగా సత్యదేవుని పూజను హేళనకూడా చేశాడు.

శ్లో॥ ఆవయోరంతరం హిత్వా
లజ్జామప్యతి మూఢధీః
మామ స్యాహూత వాన్మూఢః
కీం వక్ష్యే కాలవక్రతామ్॥

నేను ధనికుణ్ణి, తాను దరిద్రుడు అనే తారతమ్యాన్నయినా గుర్తించక ఈ బ్రాహ్మణుడు నిర్లజ్జగా నన్నుకూడా ఆహ్వానించాడు. ఏమి కాలమహిమ! అని ముక్కుమీద వేలు వేసుకున్నాడు దుష్టబుద్ధి. ఆహ్వానాన్ని, స్వామి పూజను నిర్లక్ష్యంచేసి అచటి నుండి దుష్టబుద్ధి ప్రయాణమైనాడు.

ఇక అతడికి పాట్లు అరంభమయినాయి. దారిలో అడవి దొంగలు ధనాన్నంతా కొల్లగొట్టారు. దుష్టబుద్ధికి చేతులు కాళ్లు కట్టివేసి చితకకొట్టి పారిపోయినారు. ఇక అడవిలో ఒంటరిగా కుమిలిపోతున్నాడు.

శ్లో॥ ఏకాకీ నిర్ధనో భూత్వా
మన సేతి వ్యచింతయత్
సత్య పూజా మదృష్ట్వా ఽహం
అనా దృత్యత్వరాన్వితః

స్వామి పూజను చూడలేదు సరికదా అనాదరణకూడా చేశానని పశ్చాత్తాప పడనారంభించాడు.

శ్లో॥ మత్సైన్య మద్ధనం సర్వం
పునరాగత్యమాం విశేత్
తదా విత్తానుసారేణ
పూజ యిష్యామి మాధవా

ఓ మాధవా ! నా సేనలు, ధనము తిరిగి నాకు సమకూరితే నా సంపదకు తగ్గట్లు నీ పూజ చేసుకుంటాను అని ప్రార్థనలు మొదలు పెట్టాడు.

ఇతడి ఆర్తి పెరిగినకొద్ది అవతల దొంగలకు పాట్లు ఆరంభ మయినాయి- వారికి కాళ్ళు చేతులు స్తంభించి పోతున్నాయి. ధనం పెట్టె లలో తేళ్ళు, పాములు తారాడ నారంభించాయి. ధనం మాయమయింది. గిలగిల్లాడి పోతున్నారు. ఇదంతా దుష్టబుద్ధి మాయాశక్తి అనుకున్నారు. ధనం సంగతి దేవుడెరుగు. ముందు ప్రాణాలు రక్షించుకుందాం అను కుని ఆ దొంగలు తిరిగివచ్చి దుష్టబుద్ధి కాళ్ళమీద పడ్డారు.

గండం గడచిన దుష్టబుద్ధి ధనంతో తిరిగి ప్రయాణమైనాడు. ఒక పడవలో ధనరాసులతో నదిని దాటుతున్నాడు. అయితే దుష్టబుద్ధికి సద్బుద్ధి కలిగిందా లేదా అని ప్రశ్న.

పడవవద్దకు ఒక వృద్ధ బ్రాహ్మణుడు వచ్చాడు దుష్టబుద్ధిని సమీ పించి నేను పేదవాణ్ణి. సత్యనారాయణవ్రతం చేయాలనిఉంది. ధన సహాయం చేయవలసింది. నేజేయు వ్రతంవల్ల భగవంతుడు నీకుకూడా మేలు చేస్తాడు అన్నాడు. దుష్టబుద్ధికి బుద్ధిలో మార్పురాలేదు, ధనమూ లేదు దానమూ లేదు పొమ్మని ఆ వృద్ధ బ్రాహ్మణుని తోలివేశాడు.

బ్రాహ్మణుడు వెళ్ళలేదు. బండ్లకొద్ది ధనం ఉంచుకొని లేదంటా వేందుకు? నీకు ధనం ఉంది కనుక నీవు దానం చేయడం ధర్మం,

శ్లో॥ దేశే కాలేచ పాత్రేచ
దత్త మక్షయ మశ్నుతే
పాత్రో ఽ హం బ్రాహ్మణోరిక్తః
పూర్ణిమా తిథిరుత్తమా

యోగ్యమైన కాలమందు, ప్రదేశమందు, చేసే దానం ఉత్తమ ఫలదాయకం. నేను పేద బ్రాహ్మణుడను. కనుక దానమునకు అర్హుడను పైగా ఇది శ్రేష్టమయిన పూర్ణిమ తిథి. కనీసం అర్ధో పావులో దానం చేయి. అని నచ్చచెప్పాడు. దుష్టబుద్ధికి అదేమీ తలకెక్కలేదు సరి కదా —

"విప్రవేష ధరశ్చోరత్వం
ధనం హర్తుమా గతః"

బ్రాహ్మణ వేషంలో ధనంకోసం వచ్చిన దొంగవా ఏమిటీ? అని దుష్టబుద్ధి నిందకూడా ఆరంభించాడు.

బ్రాహ్మణుడటు వెళ్ళగానే పడవ మునిగి పోనారంభించింది. దుష్టబుద్ధి ఎట్టెట్లో ఒడ్డుకు చేరాడు.

ధనము పోయిందని గోడుగోడున విలపిస్తూ దొర్లనారంభించాడు. ధనం లేకపోతే ఇక భార్య బిడ్డలు మాత్రం ఎందుకు ఆదరిస్తారు? ఇలా ధనం, సంసారం గురించి చింతించాడేగాని దైవాన్ని గురించిన స్మరణయే లేదు. చివరకు తనకు నదిలో పడి మరణించడమే శరణ్యమనే అభి ప్రాయానికివచ్చి అందుకు ఆయత్తుడైనాడు.

ఇంతలో మనస్సులో ఆతడికి తటిల్లతలా ఒక భావం మెదిలింది. యాచనకై వచ్చిన విప్రుని అనాదరణ చేశాను —

శ్లో॥ తస్మాద్దే తన్మహద్దుఃఖం
జాతం తత్ర నశం శయః
విప్ర వేషధరో నూనం
సత్యనారాయణ ప్రభుః
బ్రహ్మోమావాళం కరో వాస్యా
న్నోచేదేవం భవేత్కథమ్॥

అతడిని అలా తిరస్కరించినందువల్లనే ఈ దుఃఖం కల్గింది. అందులో సంశయం లేదు. ఆ విప్రవేషం ధరించింది సత్యనారాయణ ప్రభువో, బ్రహ్మయో, శంకరుడో అయి ఉంటాడు. లేకపోతే అలా ప్రవర్తించిన వెంటనే ఇంత కష్ట మెందుకు కల్గుతుంది? అని కనువిప్పు కల్గి, మనస్సులోనే క్షమార్పణ చెప్పుకుంటున్నాడు.

ఇంతలో ఆవిప్రుడు మరల కనిపించాడు. దుష్టబుద్ధిని వ్రతము చేయవలసిందిగా ప్రేరేపించాడు. బుద్ధిమారిన దుష్టబుద్ధి వ్రతముచేసి, చేస్తూ, జీవితమును ధన్యము చేసుకున్నాడు.

దుష్టబుద్ధి వంటివారు కోకొల్లలుగా ఉన్న ఈ కాలములో ఈ కథలోని నీతి ప్రాముఖ్యమును వక్కాణించవలసిన పనిలేదు. సత్యము, ధర్మము, దైవము, దానము, ధనము మున్నగు అన్ని విషయములలోను మానవునికి ఉండవలసిన వైఖరి ఈ కథలో వివరించబడింది

ఇక తొమ్మిదవ అధ్యాయమున సత్యమునకు అపచారము జరిగిన ఎలాంటి ప్రభావం కలిగేది. ఒక వింత కథ ద్వారా వివరించబడినది.

అవంతికా నగరంలో కౌముదియను సచ్ఛీలవతి, దైవభక్తురాలు, పతివ్రతయగు వైశ్య యువతి ఉన్నది. పూర్వజన్మ కర్మచే ఆమెకు బాల్యమునందే వైధవ్యము సంభవించినది. బంధు జనులు సైతము లేక వంటరియై జీవనము సాగిస్తుంది.

అలా ఉండగా ఆ నగరంలో పుణ్యాత్ములు పలువురు సత్య నారాయణ వ్రతము చేయుట చూచినది. ఆయా మహాత్మ్యములు విను చున్నది. అందు గొడ్రాళ్ళకు బిడ్డలు కల్గుటవంటి విశేషములను విన్నది. ఒక వంధ్య స్వామిని పుత్ర భిక్షకై వేడుకుంటూ, ప్రక్కనే ఉన్న కౌముదిని చూచి పరిహాసముతో "నీవు కూడా ప్రార్థించు, నీకూ బిడ్డలు" కల్గుతారు అన్నది. కౌముదికూడా పరిహాసముగానే "నాకును బిడ్డ కల్గితే స్వామి వ్రతం చేసుకుంటాను" అన్నది. అదియొక అద్భుతము. పరమ పవిత్రురాలు, భక్తురాలు అయిన కౌముది పరిహాసముగా అన్నప్పటికి అది స్వామిని కదలించింది. స్వామి స్వప్నమున ఆమెను కరుణించినాడు. కౌముదికి అది శాపమే అయినట్లనిపించినది. భర్త లేని తనకు సంతానము కల్గిన ఇక లోకము ఏమంటుంది ? ఆ అపవాదును భరించుట ఎట్లు అని దుఃఖించి విషపానముచేసి దేహ పరిత్యాగము చేయవలెనని నిశ్చయించింది. అమె ఎన్ని పర్యాయములు అట్టి ప్రయత్నము చేయబూనినప్పటికి, సమయానికి నిద్రమత్తు వంటిది రావడం, ఆ విషపాత్ర హరింపబడడం జరుగుతూ వచ్చింది. ఆమెకు మరణించడమే అసాధ్యమయింది. ఇక పూర్వకర్మను అనుభవింప తప్పదను నిశ్చయమునకు వచ్చి మిన్నకుండినది- కొందరు ఆమెను శంకించి, నిందలు మోపినారు. మరికొందరు ఆమెను శంకించుటకే సందేహించినారు.

చివరకు ఆమె ఒక అందాల బాలునికి తల్లియైనది. బాలునికి ఐదవ సంవత్సరము వచ్చినది. గురువువద్దకు పంపినది. విన్నదే తడవుగా అతడికి అన్ని విద్యలు వస్తున్నాయి సజ్జనులు అది దైవ కృపా విశేషముగా ప్రశంసిస్తున్నారు. దుర్జనులు అసూయ చెందుతున్నారు. కొందరు అతడికి తండ్రి లేడని హేళన చేసేవారు. నిందించేవారు. బాలుడు అన్నీ శాంతముతో సహించేవాడు.చివరకు కొందరు అసూయతో చంపడానికి కూడా ప్రయత్నించారు. వారి ప్రయత్నములన్నీ విఫలమయినాయి.

దుర్జనులు అతడి తల్లిని అపనిందలపాలు చేస్తూ, సభను జరిపి, ఆమెను పలు విధముల నిందించారు. అట్టి వారిలో నిర్గుణుడనువాడు ఆమెను అధికముగా నిందించాడు.

ఆదేమి చిత్రమో అప్పటి నుండి నిర్గుణుడు విపరీత మనస్థితికి లోనయినాడు. ఇంట్లో అతడికి భార్య దాసీగా కనిపించేది. ఆమెకును అతడు కావలివానివలె కనిపించేవాడు. కాపురము భగ్నమయింది. ఉభయులు వీధి వెంటపడి తగవులాడుకునేవారు. కొట్టుకునేవారు. వారి ప్రవర్తన లోకమునకు వింత ఆయింది. వారి దుస్థితికి లోకము జాలి పడింది.

చివరకు ఇది అంతా కౌముదిని నిందించిన ఫలితమేయని నగర ప్రముఖులు భావించారు. సభచేసి కౌముదిని పిలిపించి —

శ్లో॥ ఆహూయ కౌముదీం పుత్ర
వాక్యమబ్రువన్
మాతః కథయ పుత్రస్య
వృత్తాంతం జన సంసిది॥

తల్లీ కౌముదీ! ఈ సభలో నీ కుమారుని గూర్చిన వాస్తవమును వెల్లడించు తల్లీ అని కోరారు. ఆమె జరిగిన కథ నంతను వివరించింది. వారును పూర్తిగా విశ్వసించారు. విశ్వసించి —

శ్లో॥ కమలాక్షి నిర్గుణశ్చ
దంపతీ ప్రకృతిం గతే
ఇదానీమేవతాభ్యాంచేత్
కారయిష్యా మహేవ్రతమ్

ఈ కమలాక్షి, నిర్గుణుడను దంపతులు పూర్వమువలె అనుకూల స్థితికి వచ్చిన ఎడల వారిచే సత్యనారాయణవ్రతము జరిపించెదమని ప్రకటన చేశారు.

ఇది జరుగుతుండగా నిర్గుణుడు, కమలాక్షి దంపతులకు చిత్త విభ్రమము తొలగిపోయింది. తమ ప్రవర్తనకు తామే సిగ్గుపడుతూ వారు ఇంటికి పారిపోయినారు.

అటు ఆకాశము నుండి –

శ్లో॥ తత్రాంతరేతి గంభీరం
వాక్యం గగనమండలాత్
కౌముద్యాయదద్య దుక్తం హి
తత్తత్సత్యం నశంశయః

కౌముది చెప్పినదంతయు సత్యమే. అందు ఏ మాత్రము సంశయము లేదు అని వినవచ్చినది. కౌముది సత్యశీలము నిరూపణ అయినది. ఆ దంపతులు వ్రతముచేసి అపచారము నుండి విముక్తి పొందారు. జనులందరు పరమానందము చెందారు.

ఈ కథ ద్వారా సచ్ఛీలములోని దైవత్వము నిరూపణ అగుటయేగాక సత్యమునకు అపచారము జరిగిన ఎట్టి విపరీతములు జరుగునో వివరింపబడినది. కౌముది వంటి సత్యశీల ఎట్లు కాపాడబడునో వివరింపబడినది. కౌముది సత్యమునకు మారుపేరై నిలచినది. మనము సత్యసంధులమై యుండుటయేగాక, సత్య సంధులకు అపచారము చేయుటను కూడ ధర్మమూర్తియగు సత్యనారాయణుడు సహించడని గ్రహించదగి యున్నది.

ఈ విధముగా ఈ తొమ్మిది అధ్యాయములలో సత్యవిరత, సత్య వ్రతము ఎల్లరికి అవలంబనీయమని పలురీతుల వక్కాణింపబడినది.

**ఇది హృదయ గతము చేసుకొనవలెననుటయే ఈ కథల అంతరార్థము, ఆశయము.**

ఇట్టి సమాజ జీవనంలో దౌర్బల్యములను, వివక్షతలను అస్పృశ్యత అసమానము మున్నగు వైకల్పములను పారద్రోలి, దైవ, ధర్మ, సత్య, చింతనను ప్రతిష్టించి, తద్వారా లభించు వైయక్తిక, సామాజిక శక్తిని పెంపొందించుకొనడం అవసరం. సత్యనారాయణ వ్రతాచరణ విధానమును అవకాశమును అందరికీ అందుబాటులోకి తెచ్చి, సత్యవ్రతమును అలవర చాలి. సమాజము ధర్మనిరతము. సత్యనిష్ఠమునై శక్తివంతం కావాలి. నేడు ఆధునిక ప్రభావమువల్ల ఎందరో హిందూ ధర్మ అవగాహన కోల్పోతున్నారు. ఎందరెందరో సోదర హిందువులు ధర్మ ప్రబోధమందక, ధార్మిక వసతులు లేక ఉపేక్షితులై ఉంటున్నారు మరెందరో మతాంతరులై, మాతృదేవికి దూరమై హిందూ, సంస్కృతీ ధర్మాలకు వెలుపల జీవిస్తున్నారు. అట్టి వారందరికి హిందూ ధర్మ సంస్కృతుల నందించాలి. సత్య, ధర్మ, శక్తి నిరతమైన సంఘటిత హిందూ సమాజము రూపొంది, తాను సుఖిస్తూ ప్రపంచానికి సుఖ, శాంతిదాయక మార్గాన్ని చూపించాలి.

అందుకే సత్యవ్రత ప్రబోధం ।

అందుకే ఈ సత్యరథయాత్రా సంకల్పం ॥

—తరాముంలవారి లక్ష్మీనారాయణ

# సత్యస్వరూప వివరణ

[సత్యశీలమును అలవరచుకొనుటకు ఈ శ్లోకముల భావము మననము చేయుటకు దోహదకారి కాగలదు]

శ్లో॥ సత్యం మాతా పితా జ్ఞానం। ధర్మో భ్రాతా దయా సఖా।
శాంతిః పత్నీ క్షమా పుత్రః। షడై తే మమ బాంధవాః॥

తా॥ సత్యమే తల్లి, జ్ఞానమే తండ్రి, ధర్మమే సోదరుడు. దయయే మిత్రుడు, శాంతమే భార్య, క్షమయే పుత్రుడు, ఈ ఆరుగురు నా బంధువులు.

మం॥ సత్యాన్నాస్తి పరోధర్మః। సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ।
సత్యేన వాయురావాతి। సత్యేనాదిత్యో రోచతే।
దివిసత్యం వాచః ప్రతిష్ఠా। సత్యే సర్వం ప్రతిష్ఠితం।
తస్మాత్సత్యం పరమం వదంతి। సత్యం పరం వరం సత్యం॥

తా॥ సత్యము మించి ధర్మములేదు. సత్యమే జ్ఞానము. అంత బ్రహ్మస్వరూపము. సత్యమువల్లనే వాయువు వీస్తున్నది. సత్యమువల్లనే సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. సత్యమువల్లనే వాక్కు శాశ్వతమవుతుంది. సర్వము సత్యమందే ప్రతిష్ఠితమైఉంది. కనుకనే సత్యం సర్వశ్రేష్ఠం. సర్వోత్కృష్ఠం శ్రేయోదాయకం.

శ్లో॥ సత్యరూపం పరంబ్రహ్మ। సత్యంహి పరమం తపః।
సత్యమూలాః క్రియాః సర్వాః। సత్యాత్పరతరో నహిః॥

తా॥ సత్యరూపమే పరబ్రహ్మ. సత్యమే గొప్ప తపస్సు. సర్వ కర్మలకు సత్యమే ఆధారం. సత్యముకన్న గొప్పది లేదు.

శ్లో॥ సత్యమేవేశ్వరోలోకే। సత్యేధర్మః ప్రతిష్ఠితః।
సత్యమూలాని సర్వాణి। సత్యాన్నాస్తి పరంపదం॥

తా॥ లోకములో సత్యమేదైవం, సత్యమునందే ధర్మము ప్రతిష్ఠితమై ఉంది. సర్వమునకు సత్యమే మూలం. సత్యంకన్న పరమపదం లేదు

శ్లో॥ సత్యమేవ జయతే నానృతం। సత్యేవ సంథావితో దేవయానః
యేనాక్రమం త్యృషయోహ్యాప్తకామా। యత్రతత్సత్యస్య
పరమం విధానం॥

తా॥ సత్యమే జయిస్తుంది. కాని అసత్యము జయించదు. సత్యమే దేవతల మార్గము. సత్యముచేతనే మహనీయులు అభీష్టములు పొందుతారు. సత్యమే వ్యమేశ్వర విధానం.

శ్లో॥ సత్యం దమస్తపశ్శౌచం। సంతోషో హ్రీః క్షమార్జవం
జ్ఞానం శమోదయా ధ్యానం। ఏషధర్మ స్సనాతనః॥

తా॥ సత్యము, ఇంద్రియ నిగ్రహము, తపస్సు, శుచి, సంతోషము, బిడియము, క్షమ, ఋజుత్వము, జ్ఞానము, మనోనిగ్రహము. దయ, ధ్యానము—ఇవియే సనాతన ధర్మములు.

శ్లో॥ సత్యం శౌచం తపశ్శౌచం। శౌచమింద్రియనిగ్రహః
సర్వభూతదయాశౌచం। జల శౌచంచ పంచమం॥

తా॥ సత్యనిష్ఠ, తపస్సు, ఇంద్రియ నిగ్రహము, సర్వభూత దయ—ఇవి శౌచములు. జలశౌచము వీని తరువాత ఐదవది.

శ్లో॥ ఇజ్యాఽధ్యయనదానాని। తప స్సత్యం ధృతిః క్షమా
అలోభంచే మార్గోయం। ధర్మశ్చాష్ట విధఃస్మృతః॥

తా॥ యజ్ఞము, అధ్యయనము, దానము, తపస్సు, సత్యము, ధైర్యము, క్షమ, లోభరాహిత్యము – ఇని అష్టవిధ ధర్మములు.

శ్లో॥ సత్యమేక పదం బ్రహ్మ, సత్యే ధర్మః ప్రతిష్ఠితః
సత్యమేవాక్షయా వేదాః। సత్యేనైవాప్యతే పరమ్॥

తా॥ సత్యమే బ్రహ్మపదం. సత్యమునందే ధర్మము ప్రతిష్ఠితమై ఉంటుంది. సత్యమే వేదస్వరూపము. సత్యము వల్లనే శ్రేయస్కరమైన స్థానము లభిస్తుంది,

శ్లో॥ సత్యమేవ వ్రతం యస్య। దయాదీనేషు సర్వదా।
కామక్రోధౌ వశేయస్య। స సాధుః కథ్యతే జనైః॥

తా॥ ఎవరికి సత్యనిష్ఠయే వ్రతమో, ఎవరు దీనులపట్ల ఎల్లప్పుడు దయతో ఉంటారో, ఎవరు కామ క్రోధములను వశమునందుంచుకుంటారో వారు సాధువులు.

శ్లో॥ సత్యహీనా వృథాపూజా। సత్యహీనో వృథా జపః
సత్యహీనం తపోవ్యర్థం। ఊషరేషూదకం యథా॥

తా॥ సత్యనిష్ఠలేని పూజ, జపము, తపస్సు, ఊసరక్షేత్రములోని వర్షమువలె వ్యర్థము.

# అన్నవరం క్షేత్ర మహిమ

సత్యరథానికి అన్నవరం శ్రీ సత్యనారాయణస్వామి దేవస్థానం వారు రమాదేవి, సత్యనారాయణస్వామివారల విగ్రహముల నందజేశారు.

అన్నవరం ఆంధ్రదేశంలో పరమ ప్రసిద్ధమైన సత్యనారాయణ స్వామి ఆలయక్షేత్రం, తూర్పుగోదావరి జిల్లాలో కాకినాడకు 40 కి. మీ.ల దూరాన పిఠాపురం తుని రైల్వేస్టేషన్‌ల మధ్య ఉంది. దేశ మంతట నుండి ఏటా లక్షలాదిమంది మంది ఇచ్చట స్వామిని సేవించు కొనేందుకు సత్యవ్రతం జరుపుకొనేందుకు వస్తుంటారు. స్వామి సత్య రథము ద్వారా గ్రామగ్రామమున దర్శనమిచ్చుట, సర్వప్రజానీకముకు పూజలకు అవకాశము కల్పించుట ప్రజల అదృష్టము.

పవిత్ర పంపానదీ తీరాన సుందర ప్రకృతి దృశ్యాలమధ్య, రత్న గిరిపై షుమారు నూరేళ్ళ క్రితం నిర్మింపబడిన ఆలయమిది.

ఆలయంలో అసాధారణమైన యంత్రం ఒకటి వుంది. శ్రీ త్రిపాద విభూతి మహానారాయణ ఉపనిషద్ ఆధారంగా ఈ యంత్రం రూపొందించబడిందని విషయజ్ఞులు చెప్తారు. అధర్వణ వేదమునకు చెందిన దేవర్షిశాఖలో అది భాగము. ఆలయము రెండస్థులుగా ఉంది. క్రింది భాగములో ఈ యంత్రం ఉంది. పై భాగములో స్వామి, అనంత లక్ష్మి, సత్యవతి అమ్మవారి విగ్రహములున్నవి.

పురాణ విజ్ఞానం ప్రకారం పవిత్ర పంపానది వింధ్యపర్వత రాజ పుత్రిక. ఆమె శ్రీహరి శాశ్వత సేవాభాగ్యమును అభిలషించింది. అందుకై తీవ్ర తపము చేసింది. ఆమె పంపానది రూపము ధరించి, శ్రీహరి పాదములకు తాకుతూ ప్రవహించునట్లు విష్ణువు వరమిస్తాడు. ఆ విధంగా విష్ణుదేవుని అవతారమయిన సత్యదేవుని సేవించే ప్రాప్తి ఆమె పొందింది.

కొండపై నున్న సత్యదేవుని విగ్రహము ప్రజలకు వెల్లడి అయిన విధమును గురించి ఒక ఇతివృత్తము తెలియవస్తుంది. యోగ్యులు, అదృష్టవంతులు, భక్తులునగు కొందరు స్థానిక ప్రజలకు స్వామి స్వప్న వృత్తాంతముగా తన విగ్రహపు ఉనికిని ఎరుక చేసెనని, దానిపై ఆ భక్తులు అన్వేషణ ఆరంభించగా ఒక చెట్టు క్రింద ఆ విగ్రహము సాక్షాత్కరించి, స్వప్న వృత్తాంతము ధృవపడినదని చెప్పబడింది. ప్రజలు పూజలు జరిపి ఆ విగ్రహమును కొండపై కొంచెం ఎత్తులో ప్రతిష్ఠించిరని వివరింప బడినది. విగ్రహము దొరికిన తావులో ప్రస్తుతము ఒక శ్రీరామాలయము శోభిల్లుతున్నది. సత్యనారాయణస్వామి ప్రధాన ఆలయానికి అది కొంత ఈశాన్యముగా ఉన్నది.

క్షేత్రము ప్రజలకు వెల్లడయిన కొద్ది అచట అనేక విశేషములు ఏర్పడినవి. సేవలు జరుగజొచ్చినవి. యంత్రమునకు విగ్రహములకు నిత్యము ముమ్మారు అర్చన జరుగుతుంది. ప్రధాన విగ్రహములతో పాటు శ్రీచక్రము సాలగ్రామములకుగూడా అర్చన జరుగుతుంది.

గర్భాలయమునకు క్రింది భాగములో ఆదిత్య, అంబిక, జ్ఞాననాథ, మహేశ్వర విగ్రహములు నాల్గుమూలలా ఉండగా మధ్యస్థానమందు సత్యనారాయణస్వామి విగ్రహమున్నది. వీటి అన్నిటని విష్ణుపంచాయతన ముగా వ్యవహరింతురు.

ఇక ప్రధాన ఆలయము రథము రూపములో ఉన్నది. నాల్గుమూలల దానికి రథచక్రములున్నవి. ప్రధాన ఆలయమునకు ముందుభాగమున కల్యాణ మండపమున్నది.

ఆలయమునకు దారిలో శ్రీరామాలయము, వనదుర్గ, కనకదుర్గ ఆలయములున్నవి. పరమేశ్వరుని అన్నివిధముల పూజించు భక్తులు ఈ

ఆలయిములన్నిటిలోను భక్తితో పూజలు, దర్శనములు చేసుకుంటారు. వనదుర్గకు విశేషముగా పూజలు జరుగుతాయి. వనదుర్గ మహాశక్తి ఆ ప్రదేశమున కంతకు ఆమె రక్షణ. ప్రతిదినము రాత్రిపూట ఆ ప్రదేశమున సంచరించునవి, కొందరు పుణ్యాత్ములకు దర్శనము కూడా లభించుచుండునవి చెప్పబడుతుంది.

సత్యదేవుడు విష్ణుమూర్తి స్వరూపము. అందువలన విష్ణు సహస్ర నామమునకు ఇచట విశేషప్రసిద్ధి. సత్యనారాయణ వ్రతమందును విష్ణు సహస్రనామ పూజ జరుగుతుంటుంది. భీష్ముడు కురుక్షేత్ర రణరంగంలో దేహత్యాగము చేయుటకు ముందు ధర్మరాజుకు అత్యంత శక్తివంతమైన విష్ణుసహస్రనామ మంత్రోపదేశము చేశాడు. అందువలన ఈ క్షేత్రమున భీష్మఏకాదశి విశేషముగా జరుగుతుంది. ఆ పర్వదినమున విష్ణుసహస్ర నామముతో సత్యనారాయణవ్రతమును అచట చేయుట గొప్ప ధన్యత అని భక్తులు భావిస్తారు.

మామూలు దినములలో కూడా అసంఖ్యాకముగా సత్యనారాయణ వ్రతములు జరుగుతుంటాయి. ఏకాదశి ఆదివారమువంటి సమయములలో ఇంకా ఎక్కువగా జరుగుతుంటాయి.

ఇంకా స్వామికల్యాణం, స్వయంమహోత్సవం, దేవీనవరాత్రి ఉత్సవములు, శ్రీరామకల్యాణము, కనకదుర్గ ఉత్సవము, ప్రభఉత్సవం, తెప్పఉత్సవం జలతోరణం ఇలా అనేకానేక ఉత్సవములద్వారా ప్రజలలో భక్తి ప్రబోధము జరుగుతూ ఉంటుంది. యాత్రికుల సంఖ్య దైవ సేవాకార్యకలాపములు పెరిగిన కొలది ఆలయ నిర్వాహకుల ద్వారా పెక్కు వసతులును పెరుగుతున్నవి.

# వ్రత విధానము

దేవతా మందిరమునకు పూలమాలలు, మామిడి తోరణము, అలంకరించవలయును. పూజ చేయువారు స్నానం చేసి, శుచిగా పీఠము నకు ఎదురుగా కూర్చుని పసుపుతో గణపతిని చేసి తమలపాకుపై ఉంచ వలెను. దీపము వెలిగించవలయును. చక్కగా తోమిన చెంబు, ఉద్ధ రిణి, చిన్న పళ్ళెము ముందు పెట్టుకొనవలయును.

ఆచమనము :

1. కేశవాయనమః 2. నారాయణాయనమః 3. మాధవాయ నమః ఈ మూడు నామాలతో ౩ సార్లు నీళ్ళు పోసికొని త్రాగవలయును. 4. గోవిందాయనమః 5. విష్ణవేనమః 6. మధుసూదనాయనమః త్రివిక్రమ, వామన, శ్రీధర, హృషీకేశ, పద్మనాభ, దామోదర, సంకర్షణ, వాసుదేవ, ప్రద్యుమ్న, అనిరుద్ధ, పురుషోత్తమ, అధోక్షజ, నారసింహ, అచ్యుత, జనార్ధన, ఉపేంద్ర, హరే, శ్రీకృష్ణాయనమః

తరువాత ఈ క్రింద మంత్రములను చేతులు జోడించి భక్తితో పఠించవలెను.

యశ్శివో నామరూపాభ్యాం యాదేవీ సర్వమంగళా। తయో స్సంస్మరణాత్పుంసాం సర్వతో జయమంగళం॥ లాభస్తేషాం జయస్తే

షాం కుతస్తేషాం పరాభవః. యేషాం ఇందీవరశ్యామో హృదయస్థో జనార్దనః। ఆపదా మపహర్తారం। దాతారం। సర్వసంపదాం, లోకాభి రామం శ్రీరామం భూయో భూయోనమామ్యహం. సర్వమంగళమాం గళ్యే శివే సర్వార్థసాధకే। శరణ్యే త్ర్యంబకే దేవి నారాయణి నమో స్తుతే. శ్రీ లక్ష్మీనారాయణాభ్యాం నమః, ఉమామహేశ్వరాభ్యాంనమః వాణీ హిరణ్యగర్భాభ్యాం నమః. శచీపురందరాభ్యాం నమః అరుంధతీ వసిష్ఠాభ్యాంనమః, శ్రీ సీతారామాభ్యాంనమః, సర్వేభ్యో మహాజనేభ్యో నమః అయం ముహూర్తస్సుముహూర్తోఽస్తు.

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వ విఘ్నోప శాంతయే॥

తరువాత ఈ క్రింది సంకల్పము చెప్పవలెను. స్వస్తి శ్రీ.... (అవి సంవత్సరం పేరు చెప్పి) నామ సంవత్సరే ఉత్తర/దక్షిణ అయనే (ఋతువు పేరు చెప్పవలెను). ఋతౌ...(ఏ మాసమో ఆ మాసం పేరు చెప్పి)...మాసే (కృష్ణ/శుక్ల)...పక్షే(ఏకాదశీ/పౌర్ణ మాసి)... తిథౌ (వారం పేరు చెప్పి)...వాసరే శుభయోగ, శుభకరణ ఏవం గుణ విశేషణ విశిష్టాయాం అస్యాం శుభతిథౌ (గోత్రం చెప్పి) గోత్రః (పేరు చెప్పుకొని)...నామధేయః మమ. ఆయుష్యాభి వృద్ధ్యర్థం శ్రీరమాసత్యనారాయణ స్వామిదేవతా ప్రీత్యర్థ్యం మమ కుటుంబస్యచ క్షేమ స్థైర్య విజయాయురారోగ్యైశ్వరాభివృద్ధ్యర్థం సకలదేశ ప్రజా శాంత్యర్థం చ శ్రీ రమా సత్యనారాయణ దేవతా పూజాంకరిష్యే.

మం : కలశస్యముఖే విష్ణుః, కంఠే రుద్రః సమాశ్రితః
మూలేతత్రస్థితో బ్రహ్మా, మధ్యే మాతృగణాః స్మృతాః
కుక్షౌతు సాగరా స్సర్వే, సప్తద్వీపా వసుంధరా

ఋగ్వేదోఽథయజుర్వేదః, సామవేదోహ్యథర్వణః
అంగైశ్చసహితాస్సర్వే కలశాంబుసమాశ్రితాః
గంగేచ యమునేచైవ గోదావరి సరస్వతీ
నర్మదే సింధు కావేరీ, జలేఽస్మిన్ సన్నిధింకురు॥

ఈ మంత్రములు చదివి, చెంబు చుట్టూ గంధం పూసి పువ్వులు వేసి పైని కుంకుమబొట్టు పెట్టి అందులోని జలము దేవుని మీద, తమ మీద, పూజా సామాగ్రులమీద (ఆకుతోగాని, పూవుతోగాని) చల్లవలెను.

## గణాధిపతి పూజ

మం : ఉత్తమం గణనాధస్య పూజా సంపత్కరం శుభం
భక్తాభీష్టప్రదా, తస్మాత్, ధ్యాయేత్ విఘ్నవినాయకం॥

శ్రీ మహా గణాధిపతయేనమః ధ్యాయామి।
ఆవాహయామి రత్నసింహాసనం సమర్పయామి
పాదయోః పాద్యం సమర్పయామి (నీళ్ళు చల్లవలెను)
హస్తయోః అర్ఘ్యం సమర్పయామి ”
ముఖే ఆచమనీయం సమర్పయామి ”
స్నానమ్ – సమర్పయామి ”
వస్త్రయుగ్మం సమర్పయామి
యజ్ఞోపవీతం సమర్పయామి ”
దివ్య శ్రీ చందనం సమర్పయామి (గంధము వేయవలెను)

అలంకరణార్థం కుంకుమాక్షతాన్ సమర్పయామి, పుష్పైః పూజయామి, దూర్వాయుగ్మం (రెండు గరిక పోచలు చా॥) సమర్పయామి

శ్రీ సుముఖాయనమః, ఏకదంతాయనమః, కపిలాయనమః, గజకర్ణకాయనమః, లంబోదరాయనమః, వికటాయనమః, విఘ్నరా

జాయనమః, గణాధిపాయనమః, ధూమకేతవేనమః, గణాధ్యక్షాయ నమః, ఫాలచంద్రాయనమః, గజాననాయనమః, వక్రతుండాయనమః శూర్పకర్ణాయనమః, హేరంబాయనమః, స్కందపూర్వజాయనమః, సర్వసిద్ధి ప్రదాయకాయనమః, శ్రీ మహాగణాధిపతయేనమః

ధూపం : వనస్పత్యుద్భవైర్దివ్యై ర్నానాగంధైః సుసంయుతః
ఆఘ్రేయః సర్వదేవానాం, ధూపోఽయం ప్రతిగృహ్యతాం

శ్రీమహాగణాధిపతయేనమః ధూపమాఘ్రాపయామి(సాంబ్రాణి గాని, అగరువత్తిగాని ధూపం వేయవలెను.)

దీపం :— సాజ్యమేకార్తి సంయుక్తం వహ్నినాయోజితం ప్రియం
గృహాణ మంగళం దీపం త్రైలోక్యతిమిరాపహం,
భక్త్యాదీపం ప్రయచ్ఛామి దేవాయ పరమాత్మనే
త్రాహిమాం నరకాత్ఘోరాత్ దివ్యజ్యోతి ర్నమోఽస్తుతే॥

అని వత్తిగాని, హారతి కర్పూరం గాని దీపం వెలిగించవలెను.

దీపం దర్శయామిః ధూప దీపానంతరం శుద్ధాచమనీయం సమర్పయామి [నీరు వదలవలెను].

నైవేద్యం : శ్రీ మహాగణాధిపతయేనమః గుడం నివేదయామిః ప్రాణాయస్వాహా, అపానాయస్వాహా, వ్యానాయస్వాహా, ఉదానాయస్వాహా, సమానాయస్వాహా, మధ్యే మధ్యే పానీయం సమర్పయామి హస్తౌ ప్రక్షాళయామి, పాదౌ ప్రక్షాళయామి [నీళ్ళు వదలవలెను].

పూగీ ఫల సమాయుక్తం, నాగవల్లీదళైర్యుతం,
ముక్తాచూర్ణేన సంయుక్తం తాంబూలం ప్రతి గృహ్యతామ్॥
శ్రీ మహాగణాధిపతయేనమః కర్పూరతాంబూలం సమర్పయామి
కర్పూర నీరాజనం సమర్పయామి

మంత్రపుష్పమ్ : అక్షతలు, పుష్పాలు, దక్షిణ అందరూ చేత పుచ్చుకొని,

మంత్రం : సుముఖ శ్చైకదంతశ్చ కపిలో గజకర్ణకః
లంబోదరశ్చ వికటో విఘ్నరాజో గణాధిపః
ధూమకేతుర్గణాధ్యక్షః ఫాలచంద్రో గజాననః
వక్రతుండః శూర్పకర్ణో, హేరంబః స్కందపూర్వజః
షోడశైతాని నామాని యః పఠేచ్ఛృణుయాదపి
విద్యారంభే వివాహేచ ప్రవేశే నిర్గమేతథా
సంగ్రామే సర్వ కార్యేషు విఘ్న స్తస్య నజాయతే॥
శ్రీ మహాగణాధిపతయేనమః మంత్ర పుష్పం సమర్పయామి।

అక్షతలు, పూలు తీసికొని లేచి నిలబడి ఈ దిగువ మంత్రం చదువుచు మూడు పర్యాయములు ప్రదక్షిణము చేయవలెను.

మం : యానికానిచ పాపాని, జన్మాంతర కృతానిచ
తాని తాని ప్రణశ్యంతి, ప్రదక్షిణపదే పదే
పాపోఽహం పాపకర్మాహం, పాపాత్మా పాపసంభవః
త్రాహి మాం కృపయా దేవ శరణాగతవత్సల।
అన్యథా శరణం నాస్తిః త్వమేవ శరణం మమ
తస్మాత్ కారుణ్య భావేన, రక్షరక్ష గణాధిప॥

అని నమస్కారము చేయవలెను. తరువాత అక్షతలు నీళ్ళ చేతిలో తీసికొని విడువవలెను.

"అనయా ధ్యానావాహనాది షోడశోపచార పూజయాచ భగవాన్ సర్వాత్మకః శ్రీ మహాగణాధిపతిదేవతా సుప్రీతా సుప్రసన్నా వరదా భవతు సర్వేజనాః సుఖినోభవంతు. ఉత్తరే శుభకర్మణ్యవిఘ్నమస్తు। నమ సనన్మంగళాని భవంతు అని పళ్ళెములో అక్షతలను నీళ్ళతో విడిచి పెట్టవలెను "గణాధిపతి ప్రసాదం శిరసాగృహ్ణామి" అని తల మీద ప్రసాదము వేసికొనవలెను.

ం ం ం

# శ్రీ సత్యనారాయణ పూజ

పిదప సత్యనారాయణ ప్రతిమను తమలపాకుమీద నుంచి ఈ క్రింది విధముగా పంచామృతములతో శోధనము చేయవలెను.

## ప్రాణ ప్రతిష్ఠాపనం కరిష్యే

ఓం అస్య శ్రీ ప్రాణ ప్రతిష్ఠాపన మహామంత్రస్య బ్రహ్మ విష్ణు మహేశ్వరా ఋషయః, ఋగ్యజుస్సామాధర్వణాని ఛందాంసి, ప్రాణ శ్శక్తిః, పరాదేవతా హ్రాం బీజం, హ్రీం శక్తిః, క్రోం కీలకం, శ్రీ సత్యనారాయణ ప్రాణ ప్రతిష్ఠాజపే వినియోగః హ్రాం అంగుష్ఠాభ్యాం నమః, హ్రీం తర్జనీభ్యాం నమః, హ్రూంమధ్యమాభ్యాంనమః, హ్రైం అనామికాభ్యాంనమః హ్రౌం కనిష్ఠికాభ్యాం నమః, శిరసేస్వాహా, హ్రూం శిఖాయైవషట్, హ్రైం కవచాయ హుం, హ్రౌం హ్రాం కరతలకర పృష్ఠాభ్యాం నమః హ్రాం హృదయాయ నమః హ్రీం నేత్రత్రయాయవౌషట్, హ్రః అస్త్రాయఫట్, భూర్భువస్సువరోమితి దిగ్బంధః, ధ్యానం, శ్లో॥ శాంతాకారం భుజగశయనం పద్మనాభం సురేశం। విశ్వాకారం గగనసదృశం మేఘవర్ణం శుభాంగం లక్ష్మీ కాంతం కమలనయనం యోగి హృద్ధ్యానగమ్యం। వందే విష్ణుంభవ భయహరం సర్వలోకైకనాథం ఓం హ్రాం హ్రీం క్రోం యం రం లం వం శం షం హం ళం క్షం శ్రీ సత్యనారాయణ ప్రాణ ఇహ ప్రాణ ఓం హ్రాం హ్రీం క్రోం శ్రీ సత్యనారాయణ సర్వేంద్రి యాణి వాఙ్మనశ్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణ, ఇహైవాగత్య సుఖం చిరంతిష్ఠంతు స్వాహా ఓం సాంగం సాయుధం సవాహనం సశక్తిం పత్నీపుత్రపరివారసమేతం శ్రీ సత్యనారాయణ మావాహయామి స్థాప యామి పూజయామి.

ధ్యానం — శ్లో॥ ధ్యాయేత్సత్యం గుణాతీతం గుణత్రయ సమ న్వితం లోకనాథం త్రిలోకేశం కౌస్తుభాభరణం హరిం పీతాంబరం,

నీలవర్ణం శ్రీవత్సపదభూషితం, గోవిందం గోకులానందం బ్రహ్మాద్యైరభిపూజితం శ్రీ సత్యనారాయణస్వామినే నమః ధ్యానం సమర్పయామి

శ్లో॥ జ్యోతి శ్శాంతం సర్వలోకాంతరస్థ మోంకా రాఖ్యం యోగిహృద్ధానగమ్యం, సాంగం శక్తిం సాయుధం భక్తిసేవ్యం సర్వాకారం విష్ణుమావాహయామి. శ్రీ సత్యనారాయణస్వామినేనమః, ఆవాహనం సమర్పయామి

శ్లో॥ కల్పద్రుమూలే మణివేదిమధ్యే సింహాసనం స్వర్ణమయం విచిత్రం విచిత్రవస్త్రావృతమచ్యుతప్రభో గృహాణలక్ష్మీధరణీ సమేత, శ్రీ సత్యనారాయణస్వామినే నమః రత్నసింహాసనం సమర్పయామి

శ్లో॥ నారాయణ నమస్తే స్తువరకార్ణవతారక, పాద్యం గృహాణ దేవేశ మమ సౌఖ్యం వివర్ధయః శ్రీ సత్యనారాయణస్వామినే నమ పాదయోః పాద్యం సమర్పయామి

అర్ఘ్యం- శ్లో॥ వ్యక్తావ్యక్త స్వరూపాయ హృషీకపతయేనమః మయా నివేదితో భక్త్యా హ్యర్ఘోయం ప్రతి గృహ్యతాం, శ్రీ సత్యనారాయణస్వామినే నమః హస్తయోరర్ఘ్యం సమర్పయామి

ఆచమనీయం–మందాకిన్యాస్తుయద్వారి సర్వ పాపహరం శుభం తదిదం కల్పితం దేవసమ్యగా చమ్యతాం విభో, శ్రీ సత్యనారాయణ స్వామినే నమః ఆచమనీయం సమర్పయామి.

స్నానం–శ్లో॥ తీర్థోదకైః కాంచనకుంభసంస్థై స్సువాసితైర్దేవ కృపారసార్ద్రైః, మయార్పితం స్నానవిధిం గృహాణ,ఉపాదాబ్జ నిష్యూత నదీప్రవాహ, శ్రీ సత్యనారాయణస్వామినే నమః స్నపయామి

పంచామృత స్నానం స్నానం పంచామృతైర్దేవగృహాణ పురుషోత్తమ, అనాథనాథసర్వజ్ఞ గీర్వాణ ప్రణతిప్రియ, శ్రీ సత్యనారాయణస్వామినే నమః పంచామృతస్నానం సమర్పయామి

శుద్ధోదకస్నానం — శ్లో॥ నదీనాం చైవ సర్వాసామానీతం నిర్మలోదకం, స్నానం స్వీకురు దేవేశ మయాదత్తం సురేశ్వర, శ్రీ సత్యనారాయణ స్వామినే నమః శుద్ధోదకస్నానం సమర్పయామి

వస్త్రం—శ్లో॥ వేదసూక్త సమాయుక్తే యజ్ఞసామ సమన్వితే సర్వవర్ణ ప్రదేదేవవాససీ తే వినిర్మితే, శ్రీ సత్యనారాయణస్వామినేనమః వస్త్రయుగం సమర్పయామి

యజ్ఞోపవీతం- శ్లో॥ బ్రహ్మ విష్ణుమహేశానాం నిర్మితం బ్రహ్మసూత్రకం, గృహాణ భగవన్ విష్ణో సర్వేష్టఫలదోభవ. శ్రీ సత్యనారాయణస్వామినే నమః యజ్ఞోపవీతం సమర్పయామి.

గంధమ్ శ్లో॥ శ్రీఖండం చందనం దివ్యం గంధాఢ్యం సుమనోహరం, విలేపనం సురశ్రేష్ఠ ప్రీత్యర్థం ప్రతిగృహ్యతాం. శ్రీ సత్యనారాయణస్వామినే నమః. దివ్యశ్రీ చందనం సమర్పయామి

ఆభరణం- శ్లో॥ హిరణ్య హార కేయూర గ్రైవేయ మణికంకణై సుహారం భూషణైర్యుక్తం గృహాణ పురుషోత్తమ, శ్రీసత్యనారాయణ స్వామినే నమః ఆభరణం సమర్పయామి.

అథాంగపూజా

కేశవాయనమః పాదౌపూజయామి, గోవిందాయనమః గుల్ఫౌ పూజయామి, ఇందిరాపతయే నమః జంఘే పూజయామి, అనఘాయనమః జానునీ పూజయామి, జనార్ధనాయనమః ఊరూం పూజయామి. విష్ఠరశ్రవసేనమః కటిం పూజయామి, ఓం కుక్షిస్థాఖిల భువనాయ నమః ఉదరం పూజయామి, లక్ష్మీవక్షస్థ్సలాలయాయనమః వక్షస్థ్సలం పూజయామి, శంఖచక్ర గదా శార్జ్గపాణయేనమః బాహూన్ పూజయామి, కంబుకంఠాయ నమః కంఠం పూజయామి, పూర్ణేందు నిభ వక్త్రాయనమః వక్త్రం పూజయామి, కుందకుట్మలదంతాయనమ, దంతాన్పూజయామి, నాసాగ్ర మౌక్తికాయనమ, నాసికాం పూజయామి, సూర్యచంద్రాగ్ని ధారిణేనమ, నేత్రే పూజయామి, సహస్ర శిరసేనమ, శిరఃపూజయామి, శ్రీ సత్యనారాయణ స్వామినే నమ, సర్వాణ్యంగాని పూజయామి.

# అష్టోత్తర శతనామపూజా

నారాయణాయనమః
నరాయ
శౌరయే
చక్రపాణయే
జనార్దనాయ ౫
వాసుదేవాయ
జగద్యోనయే
వామనాయ
జ్ఞానపంజరాయ
శ్రీవల్లభాయ ౧౦
జగన్నాథాయ
చతుర్మూర్తయే
వ్యోమకేశాయ
హృషీకేశాయ
శంకరాయ ౧౫
గరుడధ్వజాయ
నారసింహాయ
మహాదేవాయ
స్వయంభువే
భువనేశ్వరాయ ౨౦
శ్రీధరాయ
దేవకీపుత్రాయ
పార్థసారథయే
అచ్యుతాయ
శంఖపాణయే ౨౫
పరంజ్యోతిషే

ఆత్మజ్యోతిషే నమః
అచంచలాయ
శ్రీవత్సాంకాయ
అఖిలాధారాయ ౩౦
సర్వలోకప్రభవే
త్రివిక్రమాయ
త్రికాలజ్ఞానాయ
త్రిధామ్నే
కరుణాకరాయ ౩౫
సర్వజ్ఞాయ
సర్వాంగాయ
సర్వస్మై
సర్వేశాయ
సర్వసాక్షిణే ౩౫
హరయే
శార్ఙ్గిణే
హరయే
శేషాయ
హలాయుధాయ ౪౫
సహస్రబాహవే
అవ్యక్తాయ
సహస్రాక్షాయ
అక్షరాయ
క్షరాయ ౫౦
గజారిఘ్నాయ
కేశవాయ

కేశిమర్దనాయ నమః
కైటభారయే
అరవిందలోచనాయ ౫౫
కామదాయ
కమలేక్షణాయ
హంసశత్రవే
అధర్మశత్రవే
కాకుత్థ్సాయ ౬౦
ఖగవాహనాయ
నీలాంబుదద్యుతయే
నిత్యాయ
నిత్యతృప్తాయ
నిత్యానందదాయ
సురాధ్యక్షాయ
నిర్వికల్పాయ
నిరంజనాయ
బ్రహ్మణ్యాయ
పృథివీనాథాయ
పీతవాసనే
గుహాశ్రయాయ
వేదగర్భాయ
విభవే
విష్ణవే
శ్రీమతే
త్రైలోక్యభూషణాయ
యజ్ఞమూర్తయే
అమేయాత్మనే
వరదాయ ౮౦
వాసవానుజాయ
జితేంద్రియాయ
జితక్రోధాయ
సమదృష్టయే
సనాతనాయ ౮౫
భక్తప్రియాయ
జగత్పూజ్యాయ
పరమాత్మనే
అసురాంతకాయ
సర్వలోకానామంతకాయ
అనంతాయ
అనంతవిక్రమాయనమః
మాయాధారాయ
నిరాధారాయ
సర్వాధారాయ ౯౫
ధరాధరాయ
నిష్కళంకాయ
నిరాభాసాయ
నిష్ప్రపంచాయ
నిరామయాయ ౧౦౦
భక్తవశ్యాయ
మహోదారాయ
పుణ్యకీర్తయే
పురాతనాయ
త్రికాలజ్ఞాయ
విష్టరశ్రవసే
చతుర్భుజాయ

శ్రీ సత్యనారాయణస్వామినేనమః

నానావిధ పరిమళ పుష్పాణి సమర్పయామి

ధూపం — శ్లో॥ దశాంగం గుగ్గులూపేతం సుగంధం సుమనో హరం, ధూపం గృహాణ దేవేశ సర్వదేవనమస్కృత, శ్రీ సత్యనారాయణస్వామి నేనమః ధూప మాఘ్రాపయామి.

దీపం — శ్లో॥ ఘృతాక్తవర్తిసంయుక్తం వహ్నినా యోజితం ప్రియం, దీపం గృహాణ దేవేశ త్రైలోక్యతిమిరాపహమ్ శ్రీ సత్యనారాయణస్వామి నేనమః దీపం సమర్పయామి.

నైవేద్యం — శ్లో॥ సౌవర్ణస్థాలిమధ్యేమణిగణఖచితే గోఘృతాక్తాన్ సుపక్వాన్ భక్ష్యాన్ భోజ్యాంశ్చ లేహ్యానపరిమితరసాన్ చోష్యమన్నం నిధాయ, నానాశాకైరుపేతం దధిమధుగుడ క్షీరపానీయయుక్తంరాజాన్నం మాపసంయుక్తం శాకచోష్య సమన్వితం, ఘృతభక్ష్యసమాయుక్తం నైవేద్యం ప్రతిగృహ్యతామ్ అమృతమస్తు, అమృతోపస్తరణమసి ప్రాణాయనమః అపానాయనమః వ్యానాయనమః ఉదానాయనమః సమానాయ నమః, బ్రహ్మణేనమః, శ్రీ సత్యనారాయణస్వామినేనమః, మహానైవేద్యం సమర్పయామి, ఉత్తరాపోశనం సమర్పయామి హస్తౌప్రక్షాళయామి, పాదౌ ప్రక్షాళయామి, శుద్ధాచమనీయం సమర్పయామి

తాంబూలం — శ్లో॥ పూగీఫలైస్సకర్పూరైర్నాగవల్లీదళైర్యుతం ముక్తాచూర్ణ సమాయుక్తం తాంబూలం ప్రతి గృహ్యతామ్.

శ్రీ సత్యనారాయణస్వామినే నమః తాంబూలం సమర్పయామి.

శ్లో॥ నీరాజనం గృహాణేదం పంచవర్తి సమన్వితం, తేజోరాశి, మయందత్తం గృహాణత్వం సురేశ్వర, శ్రీ సత్యనారాయణస్వామి నేనమః కర్పూర నీరాజనందర్శయామి.

ప్రదక్షిణ నమస్కారా,— శ్లో॥ యానికానిచ పాపాని జన్మాంతర కృతాని చ, తానితాని ప్రణశ్యంతి ప్రదక్షిణ పదేపదే. పాపోహం,

పాపకర్మాహం పాపాత్మా పాపసంభవః, త్రాహిమాం కృపాయా దేవశరణా గతవత్సల, అన్యధాశరణం నాస్తి త్వమేవ శరణం మమ. తస్మాత్కారుణ్య భావేన రక్ష రక్ష జనార్దన, ప్రదక్షిణం కరిష్యామి, సర్వభ్రమ నివారణం, సంసారసాగరన్మాం త్వం ముద్ధరస్వ మహాప్రభో, శ్రీ సత్యనారాయణస్వామినే నమః ప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి, ఛత్రం సమర్పయామి, చామరం వీజయామి, గీతం శ్రావయామి, నృత్యం దర్శయామి, సమస్త రాజోపచారన్ సమర్పయామి.

ప్రార్థనా–శ్లో॥ అమోఘం పుండరీకాక్షం నృసింహం దైత్యసూదనం. హృషీకేశం జగన్నాథం, వాగీశం వరదాయకమ్, సుగుణం చ గుణాతీతం గోవిందం గరుడధ్వజం, జనార్ధనం జనానందం జానకీ వల్లభం హరిమ్, ప్రణమామి సదా భక్త్యా నారాయణ మజం పరం, దుర్గమే విషమే ఘోరే శత్రుణా పరిపీడితే, విస్తారయతు సర్వేషు తథా నిష్టభయేషు చ, నామాన్యేతాని సంకీర్త్య ఫల మీప్సిత మాప్నుయాత్, సత్యనారాయణం దేవం వందే ఽ హం కామదం ప్రభుం లీలయా వితతం విశ్వం యేన తస్మై నమోనమః శ్రీ సత్యనారాయణస్వామినే నమః ప్రార్థన నమస్కార సమర్పయామి.

ఒక కొబ్బరికాయ దేవుని ముందుంచవలెను.

ఫలం–శ్లో॥ ఇదం ఫలం మయా దేవ స్థాపితం పురత స్తవ, తేన మే సఫలావా ప్తిర్భవేజ్జన్మని జన్మని, శ్రీ సత్యనారాయణనమః ఫలం సమర్పయామి.

శ్లో॥ యస్య స్మృత్యాచ నామో క్త్యా తపః పూజా క్రియాదిషు, న్యూనం సంపూర్ణతాం యాతి సద్యో వందే తమచ్యుతం. మంత్రంహీనం క్రియాహీనం భక్తిహీనం జనార్ధన, యాత్పూజితం మయా దేవ పరిపూర్ణం తద స్తుతే, అనయా ధ్యానఆవాహనాది షోడశోపచారపూజయాంచ భగవాంత్సర్వాత్మకః శ్రీ సత్యనారాయణ దేవతా స్సుప్రీతా వరదా భవతు. శ్రీ సత్యనారాయణ ప్రసాదం శిరసాగృహ్ణామి.

# శ్రీ సత్యనారాయణస్వామి మంగళహారతి

సత్యనారాయణకూ। అంగనములారా నిత్య। మంగళమనరే। సత్యనారాయణస్వామికి। మనమంతా। ముత్యాల పళ్ళేరములనూ చేతనూబూని। ప్రత్యహము కర్పూరహారతులూ। జయమంగళంబని। నృత్యములతో। పాటపాడుచునూ। మదినమ్మి యీతని సత్యలోక నివాసుడనుచునూ। అత్యంత భక్తితో సమమోద్పుల। అర్చనబు గావించి ప్రీతితో। ప్రత్యగాత్మ స్వరూపుడా .అలదైత్యనాశకు దాపుజేర ॥సత్య॥

1) కాశీ బ్రాహ్మడురిక్తుడూ। ఈ వ్రతమూనూ వాసిమీరగా చేయగా। గాశిలో దాహమూపై మూకుళించియో॥ భూసురుడనిగొని శూద్ర పురుషుని కవి। దోసిలొగ్గుతుస్వామి ఈ వ్రతమూ। అనువందజేసిన ఏ సుఖంబులు గల్గునో దయనూ। వివరింపుడని యా భుసురుండనె వానితోడుతనూ। శ్రీ వాసుదేవుని వ్రతము సుమ్మిది చేసినను ధనధాన్య సంపద వాసి గల్గునటుల యాతడుజేసి యిహపరసౌఖ్యమొందె ॥సత్య॥

2) మన్ను వైశ్యుడు సాధువూ అతి భోగముతో యన్న శక్యముగాగనూ। పన్నాగ రత్నాల వ్యాపారముజేయగా। గ్రన్నా నోడలో కదలిపో నొకచోటా। సన్నుతాంగుడు ఉల్కాముఖుడయ్యె। రాజేంద్రుడీ వ్రతమున్నతంబుగ। ,జేయపొడగాంచే। అలవెన్నుడీ। వ్రతపు సంతతి। ఉన్నదీనికి। ముఖ్యఫలమ దన్ననాకును। సుతుబుగలిన। పన్నుగా నేజీతునని మ్రొక్కె ॥సత్య॥

3) అంతాటారతిబోలెడూ। కూతురూగల్గె। కొంతాకాలమూ కాతనికి। అంతదానిని తన కాంతాజ్ఞప్తికితేగ। ఇంతిపెండ్లిలో జేతా మిపుడూగాదనిపల్కె। వింతగనూ గావించి। అల్లునితోవర్తకముకేగగ। సత్యమూర్తి ప్రభావమున వాని। సంకెలలనిడియా చంద్రకేతుడు। ఖైదుపేయగనూ। వారంత జ్ఞప్తికివచ్చి మ్రొక్కగ। అంతవారలు వ్రతము జేసి। అచింత్యరూపుని। అందజేరే ॥సత్య॥

4) అగపడి శ్రీ విష్ణువూ। భూసురూవేషా। మదిబూని సాధుజేరి। జడకోర్వజాలనూ। వెదకీర్బ్యామన నతడు। పాద యీ యొడలో। వీన పుడకలేగానీ। వెదకినను। కానైనలేదయ్యా। నీ మాట నిజమవి యుట విభుండరు శాపమిడి చనియే। తమ నావల। విని పొర్లుచు। పోవుటను గనియే। అతివేదనలవారొచ్చి మ్రొక్కగ। నీదు ధనమందుండు పొమ్మన। మోదమొందుచు పొమ్మగొని దామోదరుని గొనియాడి పొగడే ॥సత్య॥

5) ఇంటా కూతురూ తల్లియూ। యీ వ్రతమూనూ। వెంటానే గావించి తాబోయె। యేవంకా జూచినా। కంటికేపతి కానరాతయ్యె। నీవింటికేగి ప్రసాదము గొని నా కంటికేపతి కానబడునననీ। ఇంతి బలుకను నట్టుజేయ ఆమెయాగటి। అందరూగనియే ॥సత్య॥

6) ఇంగితాశూన్యుడైనా। భూసురుడూ। తుంగాధ్వజాడు వేటకూ। సంగాతిగానేగి। చాలామృగములాచెండి। పొంగుచూ ఒక మఱ్ఱి భూజమూ కడకేగీ। రంగుగను యాదవులు। పత్రముతో ప్రసాదమివ్వగ చెంగటిం చెను। వాని కోపముతో। అలోన తనపతి। దొంగ లెత్తుకపోయిరనివిని నా ఆసంగతిని గుర్తెరిగి। యా నృపపుంగవులు యాదవుల గూడు కో। మంగళాంగుని వ్రతముజేసి। అఖంగమున సురపదమునొందే ॥సత్య॥

7) పాలు చక్కెర గోఘృతమూ। గోధుమపిండి। మేలైన ద్రాక్ష పండ్లు। వాలాయాముగా తేనె పాలు అటిపండ్లు। చాలాపాకమూ జేసి। చక్కగా శ్రీకాంతాలోలునకు నైవేద్యమర్పించి। భక్తి జాగరణాలతో। నా రాత్రి వెళ్ళించి। భూసురులకన్నము వాలలాడగబెట్టి మెప్పించి। ఈవల జేసినను తెరంగుల చాల శుభమొందెదరూ। శిష్టా బాలకృష్ణయశాస్త్రి నేలిన సీలనీరదగాత్రు కృపచే ॥సత్య॥

—: సమాప్తం :—